# మన మతములు-ప్రవక్తలు

రచయిత

కప్పగంతుల సత్యనారాయణ

ప్రకాశకులు

కథామాల ప్రచురణలు

మైలాపూర్ : మదరాసు-4

# అవతారిక

అనాదికాలంనుంచీ మానవుడు తనకన్న గొప్పశక్తి యేదో వున్నదనీ, ఆశక్తివల్లనే ప్రపంచసృష్టి, రక్షణ జరుగుతున్నదనీ విశ్వసిస్తూవచ్చాడు. అలాటి మహాశక్తిని దైవంగా భావించి, తన మనుగడకోసం, రక్షణకోసం ఆరాధించేవాడు.

ఈ ఆరాధన, మానవుని ఆదిమదశలో ప్రార్థన ద్వారా జరిగింది. కాలక్రమేణ, మానవుడు తనదైవానికి ఒకరూపాన్ని కల్పించుకోవడం, ఆరూపాన్ని మట్టితోనో, కర్రతోనో, రాయితోనో, లోహంతోనో మలచి, దానికి ప్రార్థనలను అర్పించి, పూజలనుచెయ్యడం ప్రారంభమైంది.

నిత్యజీవితంలో తనఅవసరాలనుగడిపే జంతువులనూ, తన వునికికి ప్రమాదంకలిగించే జంతువులనూ, ప్రకృతిసిద్ధములైన సూర్యచంద్రగ్రహాలనూ, తానుండేభూమినీ, చెట్లనూ పుట్టలనూ పర్వతాలనూ. వాననూ ఉరుమునూ మెరుపునూ, నదులనూ సముద్రాలనూ దైవస్వరూపాలుగా భావించి, వానికి అధిదేవతలను కల్పించుకొని ఆదేవతలను మానవుడు ఆరాధనచేయసాగాడు. ఈ విధంగా, అనేకంగా దేవుళ్లు ఏర్పడ్డారు.

మానవులు చిన్నచిన్నతండాలుగా జీవించే అనాది కాలంలో, ఒకతండాకు ఒకముఖ్యదేవత, ఒకజాతికి ఒక ముఖ్యదేవత వుండేవారు.

తన జీవితానికి అవలంబనగా ఏర్పరుచుకున్న దేవుని గూర్చి మానవుడుచేసే ఆరాధనాకలాపానికే మతంఅని పేరువచ్చింది.

సృష్టిజరిగినతరువాత చాలాకాలంవరకూ, పరలోకం అంటూ ఒకటివుందని మానవులు అనుకొనేవారు కారు. ఒకమనిషి చనిపోతే, అతడిప్రాణం మళ్ళీ ఆశరీరంకోసం తిరిగివస్తుందనుకొనేవారు. కొంతకాలానికి ఆ నమ్మకం పోయింది. చనిపోయినమనిషిప్రాణం తిరిగి అతడిశరీరంలో ప్రవేశించకపోయినా, ఆశరీరపరిసరాలలోనే ఉంటుందని అనుకొనేవారు. ఇలాంటివిశ్వాసం వున్నంతకాలం, చని పోయినవారిని పెద్దపెద్ద గోతులలోపూడ్చి, వారికి ప్రియము లైన వస్తువులనుకూడా వారితో పూడ్చిపెట్టేవారు.

ఇంకాకొంతకాలం గడచినతరువాత, శరీరాన్నివిడ చినప్రాణి యీలోకంలోవుండదనీ మరొకలోకానికి పోతుం దనీ, ఒకనమ్మకం ఏర్పడింది. అందువల్ల, ప్రాణంపోయిన తరువాత నిరర్ధకమైన కళేబరాన్ని దాచవలసిన అవసరం లేదని గ్రహించి, శవాలను దహనంచేసే అచారాన్ని కొన్నిప్రాంతాలమానవులు అవలంబించారు.

పరలోకానికిపోయిన జీవి ఆలోకంలో అనుభవించే సుఖదుఃఖాలు, యీలోకంలో అతనిప్రవర్తనమీాద ఆధార పడివుంటా యనే నమ్మకం మానవులలో బాగా వ్యాపించిన తరువాత, పరలోకంలో ఆనందాన్ని అనుభవించడంకోసం వారు ఈలోకంలో కొన్నినియమాలు ఏర్పరచుకున్నారు. ఆనియమాలుకూడా, మతంలో ఒకభాగ మయాయి.

సూక్ష్మవిమర్శనలో, యీనాడు ప్రపంచంలో అనేక మతాలు కనపడుతున్నప్పటికీ, స్థూలంగాచెప్పాలంటే అన్ని మతాలకు ప్రాతిపదికలు, పైనచెప్పిన అంశాలే.

మతంలేని మానవుడు లేడు. ప్రతివ్యక్తికీ ఏదోఒక మతం వుంటుంది. ఆమతం అనాదినుంచీ అతడిపూర్వీకులు అనుసరించినది కావచ్చు; ఎవరోప్రవక్తచెప్పగా మధ్యలో తనవంశీకులు కొత్తగా అవలంబించినది కావచ్చు; లేదా, ఇహపరాలనుగురించి ఆలోచించి ఒకవ్యక్తి తన సంస్కా-రానుగుణంగా తానునిర్ణయించుకున్నది కావచ్చు.

అనాదిదశలో మానవులు ప్రకృతిని ఆరాధించిననాడు, ఒకొక తెగకు మతాలను ఆతెగనాయకులు వంశపారంపర్యంగా నిర్ణయించేవారు. ఒకటిరెండు తెగలు కలసిపోయినప్పుడు, ఉభయులమతాలను మిళితంచేసుకొని, ఉభయుల దేవతలను వారు ఆరాధించేవారు. తండాలుగా, తెగలుగా జీవించేమానవులు స్థిరనివాసాలను ఏర్పరచుకొని జాతులుగా ఏర్పడినప్పుడు వారిదేవతలసంఖ్య పెరిగేది. దూరదూర ప్రాంతాలలోని జాతులు ఒకరితోఒకరు వ్యాపారంవల్లనో, యుద్ధాలవల్లనో సంబంధాలను కలుపుకొన్నప్పుడు, ఒకజాతి ఆచారవ్యవహారాలను, మతవిశ్వాసాలను మరొకజాతిప్రజలు ఇష్టపడిగాని, యుద్ధంలోఓటమివల్ల బలవంతంగాగాని అలవరచుకోవడం జరిగేది.

ప్రాచీనఆచారాలను అనుసరిస్తూ, పూర్వీకుల మతవిశ్వాసాలను పాటిస్తూ జీవితాలనుగడిపే ప్రజలలో, ఒకొక్కకాలంలో ఒకధీశాలి బయలుదేరి, ప్రజల ఇహపర

జీవితాలనూ గురించీ, సృష్టినిగురించీ, పరమాత్మనుగురించీ ఆలోచించి మానవులు అనుసరించవలసింది ఈధర్మమని, ఈమతమని ప్రవచించేవాడు. అది యుక్తమని తమకుతోచగానే, ప్రజలు ఆమతాన్ని అవలంబించేవారు. అలా ఎన్నో ధర్మాలు, మతాలు ప్రపంచంలో వ్యాప్తిలోకి వచ్చాయి.

ఆదికాలంనుంచి యిప్పటివరకూ మతంపొందిన పరిణామాన్ని నాలుగు ముఖ్యదశలుగా భాగించవచ్చును.

దేవుడు మనుష్యులందరికీ కనపడడు. యోగ్యుడని తానునిర్ణయించిన ఏఒకవ్యక్తికో కనపడి, అతనిద్వారా మానవులప్రవర్తనను నిర్దేశిస్తాడు. ఇది ప్రథమదశ. యూదుమతం ఇదే.

దేవుడు అవతారమెత్తి, భూమిమీద అనేకరూపాలలో జన్మించి, అధర్మాన్ని అణచి ధర్మాన్ని స్థాపిస్తాడు. ఇది రెండవదశ. హిందూమతం ఇదే.

దేవునికుమారుడు ధర్మబోధచెయ్యడం, మూడవదశ. క్రైస్తవమతం ఈవిధంగానే పుట్టింది.

దేవుడు తనదూతలద్వారా ఒకప్రవక్తకు సందేశాలనుపంపి, ఆప్రవక్తచేత ధర్మబోధ చేయిస్తాడు. ఇది ఇస్లాంమతం.

ఈనాడు ప్రపంచంలో అత్యధికసంఖ్యాకులు అవలంబిస్తున్న మతాలనుగురించీ, ఆమతాలనుబోధించిన ప్రవక్తల జీవితాలనుగురించీ, వివిధమతాలుపొందిన పరిణామాన్ని గురించీ క్లుప్తంగానైనా ప్రతివ్యక్తీ తెలుసుకోవడం అవసరం.

అన్నిమతాలకూ ప్రధానలక్ష్యం ఒకటేనన్న సత్యాన్ని గ్రహించి, వివిధమతాలసారాన్ని అర్థంచేసుకున్న మానవునికి పరమతసహిష్ణత కలుగుతుంది.

తననుసృష్టించి, రక్షించే దైవమొకడున్నాడని ఒక మనిషికి విశ్వాసం వున్నప్పుడు ఆదైవాన్ని ఆరాధించడం, పూజించడం అనేవిషయాలు కేవలం ఆమనిషికిమాత్రమే సంబంధించినవిషయాలు. తనవిశ్వాసాలను ఇతరులకు చెప్పడానికి ప్రతివ్యక్తికీ హక్కువున్నది. కాని, ఇతరులవిశ్వాసాలను నిరసించడానికిగాని, తనవిశ్వాసాలనే ఆదరించి, అవలంబించమని ఇతరులను నిర్బంధించడానికిగాని ఏవ్యక్తికీహక్కు లేదు. ఈసత్యాన్ని మానవులందరూ గ్రహించిననాడు, మతసంఘర్షణలు ప్రపంచంలో వుండవు.

ఏమతానికి చెందినవారైనా, అన్నిమతాలనుగురించీ తెలుసుకోవడానికి కుతూహలం ఎక్కువగా చూపుతున్నందున, తెలుగువారందరికీ యీపుస్తకం ప్రయోజనకారి కాగలదని మావిశ్వాసము.

# యూదు మతం

జెహోవా అనేదేవుని ఆరాధించేప్రజలను, మూడు వేలసంవత్సరాలనాడు, 'జెహూదీలు' అని పెర్షియనులు పిలిచేవారు. జెహుదీఅనేపదం కాలక్రమాన జ్యూ అయింది. జ్యూలమతానికి జుడాయిజం అనిపేరు. జ్యూలలో కొంత మందిమాట్లాడే భాషకు 'ఇద్దిష్' అని పేరు. ఆపదంమీాద, వీరికి యూదులు అనిపేరువచ్చింది. అందువల్ల వీరిమతానికి 'యూదుమతం' అనేపేరుకూడా వ్యాప్తిలోకివచ్చింది.

యూదులు ఒకప్రత్యేకజాతికి చెందినవారుకారు. వీరు అవలంబించే మతాన్నిబట్టి వీరికి ఆపేరువచ్చింది కాని, వారుప్రత్యేకంగా ఒకజాతి అయినందువల్లకాదు.

నీగ్రోలవలె నల్లనిరంగుగల యూదులు అబిసీనియాలో వున్నారు. చైనాలో పసుపురంగుగల యూదులు వున్నారు. చామనఛాయగలయూదులు ఇటలీలో వున్నారు. స్వీడన్, నార్వే దేశాలలో పాలరంగుగల యూదులు వున్నారు. ఎర్రటిజుట్టు, నీలినేత్రాలుగల యూదులు డెన్మార్క్, జర్మనీ, ఐర్లెండు దేశాలలో వున్నారు. ఏదేశంలోవున్నయూదులు ఆదేశపుప్రజలభాష మాట్లాడుతారు. అయితే, వారిమతం వేరు. ఏదేశంలోవున్నా, ఏరంగులో వున్నా యూదులంతా తాముఒకేజాతి అనిభావిస్తున్నారు. ఒకరికొకరు బంధువులమని అనుకుంటారు. అంతా ఒకే మతాన్ని అనుసరిస్తారు.

ప్రపంచంలో ఏదేశపుచరిత్రా, ఏజాతిచరిత్రా,

ఏప్రజలచరిత్రా అనాదినుంచి సమగ్రంగా మనకు తెలియదు. సమగ్రంగారచింపబడిన చరిత్రలేకపోయినప్పటికీ, ప్రతిదేశంలోనిప్రజలూ, ప్రతిజాతిప్రజలూ, తమనుగురించి తమపూర్వీకులు చెప్పిన కథలకు చిలవలు, పలవలు కల్పించి, ప్రపంచంలోని ఇతరులందరికన్న తామేఅధికులమని చాటుకుంటూ పురాణగాధలను అల్లుకున్నారు. సమూహాలుగా జీవిస్తూ, తమజనసంఖ్య ఎక్కువైనకొద్దీ ఎక్కువదేశాన్ని ఆక్రమించడానికి ప్రయత్నంచేస్తూ, ఇదివరకే అక్కడవున్న ప్రజలతో యుద్ధాలుచేస్తూ, తాము జయించినట్లయితే ఓడిపోయినవారిని నీచులుగాను అల్పులుగాను, తాముఓడిపోయినట్లయితే గెలిచినవారిని క్రూరులుగాను దుర్మార్గులుగాను వర్ణిస్తూ, ఆత్మస్తుతి పరనిందలతోకూడిన పురాణగాధలను ప్రతిదేశంలోనిప్రజలూ అల్లుకున్నారు. ఇలాటిగాధలలో ఏది నిజం, ఎంతనిజం అనిస్పష్టంగాచెప్పడం యీనాడు ఎవరికీ సాధ్యంకాదు. అదొక దురదృష్టం.

కాని, ఆచరిత్రలలోని పురాణపురుషులూ, వారు ఏమిచేసిందీ అనేవి స్థూలంగా తీసుకుంటే, అతిశయోక్తులు లేని పూర్వగాధ స్థూలంగా తెలుస్తుంది. ఇలాటిచరిత్రను స్థూలంగా తెలుసుకోవడానికి కొంతవరకు ఆధారమైనగ్రంథం, బైబిల్. బైబిలులో 'న్యూటెస్టమెంట్' (ఉత్తరగాధ) క్రైస్తవమతానికిసంబంధించినది. 'ఓల్డ్‌టెస్టమెంట్' (పూర్వగాధ) యూదులకు సంబంధించినది.

బైబిల్, ఒకనాడు, ఒకరు వ్రాసినదికాదు. హీబ్రూ భాషలో, కొన్నివేలసంవత్సరాలనుంచీ, రెండువేలసంవత్స

రాల పూర్వంవరకూ, యూదుల పూర్వపురుషులు తమ ప్రజలనుగురించి వ్రాస్తూవచ్చిన అనేకచిన్నచిన్న గ్రంథాల సమాఖ్య. రెండు వేలసంవత్సరాలకు పూర్వం, యూదులు ఆరమెయిక్ భాషను, లిపిని నేర్చుకొని కొన్ని గ్రంథాలను, యీభాషలో వ్రాశారు. క్రీస్తునుగురించిన గ్రంథమంతా గ్రీకుభాషలో వ్రాయబడింది. ఇవన్నీ కలిపి బైబిల్ అయింది. తరువాత, క్రీస్తుశకం మొదటిశతాబ్దంనుంచి మూడవశతాబ్దంలోపల, ఆరమేయిక్ గ్రంథమంతా గ్రీకు భాషలోకి తర్జుమా చేయబడింది.

బైబిల్ లోనుంచీ, ఇతర హిబ్రూగ్రంథాలలోనుంచీ, ఈజిప్టులోని హీరోగ్లిఫిక్ పత్రాలనుంచీ, నాలుగైదు వేల సంవత్సరాలనాటి చరిత్రను చాలావరకు స్థూలంగాచెప్పడా నికి, యీనాటి చారిత్రికపండితులకు ఆధారాలు ఏర్పడినవి.

ఈచరిత్రను అంతటినీ పరిశీలించిచూస్తే, దేవునిఆరా ధనవిషయంలో, అంతేమతవిషయంలో, మొట్టమొదట నూతనపంథాలను త్రొక్కినవారు యూదులని స్పష్టపడు తున్నది.

విగ్రహారాధన కూడదు, అని మొట్టమొదట చెప్పిన వారు యూదులు; దేవుడుఒక్కడే అని మొట్టమొదట చెప్పినవారు యూదులు.

యూదుమతబోధనలు కేవలం దేవారాధనకు సంబం ధించినవేకావు. మానవుడి నిత్యప్రవర్తన, సమూహాలుగా జీవించేమానవుల పరిపాలన, వీటికిసంబంధించిన సూత్రాలు కూడా యీమతబోధనలలో యిమిడివున్నాయి.

యూదుమతబోధనలు, ఒక ప్రవక్తమాత్రం చెప్పిన నిర్వచనాలు కావు. కొన్నితరాలతరబడి, అనేకమంది ప్రవక్తలు చెప్పిన నిర్వచనాలు.

## యూదు జాతి

ఈయూదులు ఎవరు; వారిమతం ఏమిటి?

నాలుగువేల సంవత్సరాలనాడు, ఆసియాపశ్చిమ భాగంలో ఊర్ అనేఒకగొప్ప వూరువుండేది. అది యూఫ్రేట్స్అనే నది పశ్చిమతీరాన వుంది. అప్పుడు ఆనదికి, ఆనాటి ప్రజలు పెట్టినపేరు, పురట్టు. దీనినేయూదులు పెరాత్ అన్నారు. పెర్షియనులు 'ఉఫ్రాతు' అన్నారు. గ్రీకులు యూఫ్రేట్స్ అన్నారు. గ్రీకులు పెట్టినపేరు నేటికీ నిలిచిపోయింది. ఇప్పుడు యీప్రాంతం ఇరాక్‌లో వుంది. ఆనాడు యీప్రాంతాన్ని చాల్డీ అనేవారు. ఈపదం, కల్డీఅనేపదానికి రూపాంతరం. చాలాకాలంవరకు చాల్డీ ఒకప్రత్యేక దేశంగా పరిగణింపబడేది. తరువాత, ఇది బేబిలాన్ దేశంలో ఒక భాగంఅయింది. బేబిలాన్ దేశంలోవున్న యూఫ్రేట్స్, టైగ్రిస్ (తిగ్లాత్) నదులను బట్టి, గ్రీకులుయీదేశాన్ని మెసొపొటేమియా (రెండునదులదేశం) అన్నారు. ఇటీవల సిరియా, ఇరాక్ అనే రెండుప్రత్యేకరాజ్యాలుగా ఏర్పడే వరకూ యీదేశం మెసొపొటేమియా అని వ్యవహరింపబడేది.

నాలుగువేల సంవత్సరాలనాడు, ఊర్ ఒకపెద్ద పట్టణం. అక్కడ అనేకజాతుల ప్రజలు నివసించేవారు. బేబి

లోనియనులు, సుమేరియనులు, అరబ్బులు. ఈఅరబ్బులు సెమెటిక్ జాతివారు. షెం అనే మూలపురుషుని సంతతివారు కనుక వీరికి సెమెటిక్ అనిపేరువచ్చిందని చరిత్రకారులు అంటారు.

ఈజాతికిచెందిన అబ్రిహాంఅనే ఒకపురుషుడు, ఊర్ లో నివసించేవాడు. అతడు చాలామంది బంధువర్గం, బానిసలు గల పెద్దకుటుంబి. అతనితండ్రి, తెరా, విగ్రహాలను తయారుచేయించి అమ్మేవాడు. ఆరోజులలో ప్రజలు విగ్రహారాధనచేసేవారు. మట్టితోను, రాళ్లతోను చేసినవిగ్రహాలను అమ్మి తెరా చాలాడబ్బు గడించాడు.

తనతండ్రితయారుచేయించినవిగ్రిహాలనుకొనుక్కొని, వాటిని దేవుళ్ళగా అర్చించేవారిని చిన్నతనంనుంచి అబ్రహాం చూస్తూ వుండేవాడు. ఒకప్రక్కన సుమేరియన్ జాతి. ఆర్యులు కొద్దిమంది అగ్నిహోత్రాన్ని ఆరాధించడం చూసేవాడు. అతడుదేవునిగురించి, దేవునిస్వరూపాన్నిగురించీ ఆలోచించసాగాడు. అంతరిక్షంలోవుండే దేవునికి మట్టిరూపాలను కొయ్యరూపాలను కల్పించి, అర్చించడం తప్పు అని అతనికి తోచింది. తనతండ్రి దుకాణంలో వున్న దేవుళ్ల విగ్రహాలనన్నిటినీ తండ్రికిచూపి, 'యీదేవుళ్లన్నిటిలోకి గొప్పదేవుడు ఎవరు' అని అడిగాడు. విగ్రహాలన్నిటిలోకీ పెద్దదైన ఒకవిగ్రహాన్నిచూపి "ఈదేవుడు గొప్పవాడు" అన్నాడు తెరా. అబ్రహాం అప్పటికి వూరుకున్నాడు. తండ్రిని అవతలకివెళ్లనిచ్చి, దుకాణంలోవున్న విగ్రహాలలో మట్టివాటినన్నిటినీ ముక్కలుముక్కలుగా చితకకొట్టాడు.

కొయ్యవిగ్రహాలనన్నిటినీ తగులబెట్టాడు. "అందరికన్నా గొప్పదేవుడు" అని తనతండ్రి తనకుచూపించిన పెద్దవిగ్రహాన్ని ఒక్క దానినీ అలాగే వుంచాడు. కొంతసేపటికి తెరా తనదుకాణానికివచ్చి అచటి బీభత్సాన్నిచూసి మండిపడ్డాడు. "ఈవిగ్రహాలనన్నిటినీ ఇలా ధ్వంసంచేసినది ఎవరు?" అని కొడుకును అడిగాడు. "అందరికన్న గొప్పదేవుడు, అని నువ్వుచెప్పావే, అదిగో ఆదేవుడు యీపనిచేశాడు." అని అబ్రహాం, తను తగలబెట్టకుండా వుంచిన పెద్దవిగ్రహాన్ని చూపాడు. తెరా ఆగ్రహానికి మితిలేదు. "బుద్ధిహీనుడా, ప్రాణంలేని కొయ్యబొమ్మ యీపని ఎలాచేస్తుంది?" అని గర్జించాడు.

"అయితే, ప్రాణంలేనిబొమ్మలను దేవుళ్ళనిచెప్పి పూజలెందుకు చేస్తున్నారు?" అని అబ్రహాం అడిగాడు. తెరా నిర్ఘాంతపోయాడు. ఏమీ మాట్లాడలేక పోయాడు.

తనతండ్రి తయారుచేయించిన విగ్రహాలను కొను క్కోడానికి వచ్చేవారికి, విగ్రహారాధనలో ఏమీ ప్రయో జనంలేదని అబ్రహాం చెపుతూవుండేవాడు. అందువల్ల, ఊర్‌లో అబ్రహాం దైవద్వేషిఅనీ, మతద్వేషిఅనీ ప్రచారం ప్రారంభమైంది.

విగ్రహారాధన నిష్ప్రయోజనమని ఒకనిర్ణయానికి వచ్చినతరువాత, విగ్రహారాధన ఒకప్రబలమైన మతంగాగల ఊర్ ప్రజలమధ్య నివసించడం ప్రమాదకరమని అబ్రహాంకు తోచింది. వందలఏండ్లనాడు, తనపూర్వీకులు, అరేబియా ప్రాంతంనుంచి చాల్డీకివచ్చారని ఆయన వినివుంటాడు.

ఆసియాపశ్చిమభాగంలో, మెడిటరేనియన్ తీరాన కానాన్ (ఈనాడుపాలెస్టైన్) అనే దేశం వుందనీ, ఆ దేశమూ జోర్డన్, నదీలోయప్రాంతమూ, నివాసయోగ్యములనీ ఆయనకు తెలుసు.

అబ్రహాం తానునమ్మిన దేవుని ప్రార్థిస్తాడు. ఆ దేవుడు, జెహోవా, ఆయనను కానాన్‌కు వెళ్లమని ఆదేశిస్తాడు. అబ్రహాం తనకుటుంబాన్ని, బంధువులను, పరిచారకులను వెంటబెట్టుకొని కానాన్‌కు బయలుదేరుతాడు. కాలినడకను, నాలుగైదువందలమందిజనం, కొన్నివందలపశువులను తోలుకుంటూ, విస్తారమైన సంభారాలతో కొన్నివందలమైళ్లు ప్రయాణంచెయ్యాలంటే, దారిలో ఎన్నో మజిలీలు చెయ్యాలి. ఆహారసామగ్రిఅయిపోతే, కొన్నిప్రాంతాలలో ఏడెనిమిది నెలలువుండి, కావలసినధాన్యాలను పండించుకొని, ప్రయాణాన్ని సాగిస్తూవుండాలి. అందువల్ల, ఆప్రయాణం ఎన్నో సంవత్సరాలు పడుతుంది. ఈలోపల, యీసమూహంలో కొత్తవారుకొందరు పుడతారు. కొంతమంది చనిపోతారు. మొత్తంమీద, అబ్రహాం తనగమ్యస్థానాన్ని చేరుకొనేటప్పటికి, అతని అనుయాయులసంఖ్య వేలలోకి పెరిగింది.

యూఫ్రేటీస్, టైగ్రీస్ నదుల అద్దరినుంచి వచ్చారు కనుక, అబ్రహాంఅనుయాయు లందరినీ, 'ఇబ్రి' అని కానాన్ ప్రజలు పిలిచేవారు. ఇబ్రిఅంటే అద్దరినుంచి వచ్చినవా రని అర్థం. ఇబ్రి అనేమాట హిబ్రూ అయింది.

హిబ్రూలకూ, కానాన్‌లోని ప్రజలకూ ఎడతెగని పోరాటాలు జరుగుతూవుండేవి. యుద్ధాలుసాగిస్తూ, జనలు

చేసినచోట పంటలుపండించుకొని, పశువులను మేపుకొని, కుటుంబాలను పెంచుకొని, ఇరుగుపొరుగు తెగల ఒత్తిడి యెక్కువైనప్పుడు కొంతముందుకు సాగుతూ, స్థిరనివాసానికి తగిన ప్రదేశం ఎక్కడదొరుకుతుందా అని వెతుక్కుంటూ, అబ్రహాంసంతతివారు పశ్చిమఆసియాలో, అంటే యీనాటి ఇశ్రేల్ జోర్డన్ ప్రాంతాలలో నిలకడలేని జీవితాన్ని గడుపుతూ కొన్నివందల సంవత్సరాలు గడిపారు.

నిలకడలేని జీవితాన్ని గడుపుతూ వచ్చినప్పటికీ, అబ్రహాం బోధించిన మతాన్ని మాత్రం నిలకడతో హిబ్రూలు అవలంబించేవారు. తాము బసలుచేసిన చోట్లలో వేదిక నిర్మించి, దానిమీద అగ్నిహోత్రాన్ని వ్రేల్చి, తమ దేవుడు జెహోవాను ఆరాధించేవారు.

ఇలాటి కష్టజీవితాలను గడుపుతూవుండగా, వీరిజాతికి చెందిన జోసెఫ్, ఈజిప్టురాజుకు ముఖ్యమంత్రి అయాడు. అతనికి ఈజిప్టులోఉన్న పలుకుబడివల్ల, ఈజిప్టుప్రజలుతమను బాధించరనే ధైర్యంకలిగి, హిబ్రూలు చాలామంది ఈజిప్టుకు వలసవెళ్లి, అక్కడ భూములను సంపాదించుకున్నారు. వ్యవసాయంవల్లనూ, వ్యాపారంవల్లనూ, విస్తారంగా సంపదలను పోగుచేసుకొని, సుఖంగా జీవితం గడపసాగారు. కొంతకాలానికి, జోసెఫ్ చనిపోయాడు. కాని, హిబ్రూలు ఈజిప్టులోనే వుండి చాలాభాగ్యవంతు లయారు. వారిజనాభా లక్షలసంఖ్యలో పెరిగింది. ఇలా దినదినాభివృద్ధి పొందుతూ వున్న హిబ్రూలనుచూసి, ఈజిప్టుప్రజలు కంటగించుకోసా-

గారు. వారిని ఎలాగైనా నాశనం చెయ్యాలని తమరాజును బలవంతపెట్టారు.

ఈజిప్టురాజు, హిబ్రూలస్థితిగతులను చూశాడు. వారి జనాభా చాలాఎక్కువగా పెరిగిపోతూవుండటం గమనించాడు. వారిఆస్తులన్నిటినీ ఈజిప్షనులు తీసుకోవాలనీ, వారిని బానిసలుగా చెయ్యాలనీ ఆజ్ఞాపించాడు. బానిసలుగా వున్నప్పటికీ వారిసంఖ్య పెరుగుతూవుంటే, హిబ్రూదంపతులకు పుట్టిన మగశిశువులందరినీ చంపివెయ్యమని ఆజ్ఞాపించాడు.

## మోసెస్ జననం

ఆరోజులలలో ఈజిప్టురాజధానిలో అబ్రహాం అని ఒక హిబ్రూ వున్నాడు. అతనిభార్య జోకెబెడ్. వారికి ఆరన్ అనే ఒకకొడుకూ, మిరియం అనేకూతురూ వున్నారు. మిరియం, రాజుకూతురికి పరిచారికగా అంతఃపురంలో పని చేస్తూవుంటుంది. ఇలావుండగా, జోకెబెడ్ ఒకమగ శిశువును కంటుంది. రాజుఆజ్ఞప్రకారం ఆశిశువును చంపి వెయ్యాలి. కాని, అలాచెయ్యడానికి తల్లిదండ్రులకు మనసు రాదు. ఆశిశువును ఒకతొట్టిలో పెట్టి, నైల్ నదీతీరంలో, రాజుకూతురు విహరించేచోట, నీటిలోనిపొదలలో విడిచిపెడతారు. ఆశిశువు రోదనంవిని, రాజుకూతురు ఆ స్థలానికివచ్చి, ఆశిశువును బైటికి తీయిస్తుంది. రూపురేఖలనుబట్టి, ఆశిశువు హిబ్రూబాలుడని గ్రహిస్తుంది కాని, ముచ్చటపడి ఆశిశువును తాను పెంచుకుంటా నంటుంది. శిశువును పెంచడానికి దాది కావాలికదా. ప్రక్కనేవున్న మిరియం, ఆశిశువుకు తగినదాదిని ఒకతెను తానెరుగుదునని చెప్పి, తనతల్లిని తీసుకు

వస్తుంది. తల్లి స్తన్యపానంతో, ఈజిప్టురాజుకూతురికి
పెంపుడుబిడ్డగా, ఆబాలుడు పెరుగుతాడు. నీటిలోమునిగి
చనిపోకుండా తానురక్షించినబిడ్డకు అదేఅర్థం వచ్చేటట్టుగా
మోసెస్ అని రాజుకూతురు పేరుపెడుతుంది.

మోసెస్ పెద్దవాడైనకొద్దీ, తనపుట్టుపూర్వోత్తరా
లను తనతల్లి, సోదరిల వల్ల తెలుసుకుని వుంటాడు. ఒక
ప్రక్క రాజాంతఃపురంలో, ఈజిప్షన్ గురువులవద్ద విద్యను
నేర్చుకుంటూ, తనతల్లి, సోదరిలవద్ద తనమతాన్ని గురించీ,
తనపూర్వికులను గురించీ తెలుసుకుంటాడు. అప్పటికే, ఈజి
ప్టులోని తనజాతిప్రజలు తమమతనియమాలను చాలావాటిని
విస్మరించి, ఈజిప్షనులవలె విగ్రహారాధన చెయ్యడం, బాని
సలుగా అతినికృష్టమైన జీవితాన్ని గడపడం గమనిస్తాడు.
ఈజిప్షనులపట్ల అతనికి సదభిప్రాయం పోతుంది.

ఒకరోజున ఇద్దరు హిబ్రూబానిసలను ఒక ఈజిప్షను
కొడుతూఉంటే, మోసెస్ ఆఈజిప్షనును చచ్చేటట్టు కొడ
తాడు. ఈవార్త రాజధానిలో పొక్కుతుంది. మరొకరోజున
ఇద్దరుహిబ్రూలు కొట్లాడుకుంటూ వుంటే, వాళ్లను మోసెస్
వారిస్తాడు. కాని, వాళ్లలో ఒకడు 'నువ్వెవడవు, మమ్మల్ని
అదుపులో పెట్టడానికి? మొన్న ఈజిప్షనును చంపినట్లు,
మమ్మల్నికూడా చంపుదా మనుకుంటున్నావా'? అని
మోసెస్‌ను ఈసడిస్తాడు. ఈవిధంగా, ఈజిప్షనును మోసెస్
చంపినవార్త ఈజిప్టురాజుకు తెలుస్తుంది. మోసెస్‌ను పట్టు
కొని ఉరితియ్యవలసిందని రాజు ఆజ్ఞాపిస్తాడు.

వెంటనే, మోసెస్ ఈజిప్టునుండి మిడియన్‌కు పారి

పోతాడు. మిడియన్ అంటే, యీనాడు అక్కాబా జలసంధిని ఆనుకునిఉన్న అరేబియాపశ్చిమప్రాంతం. ఈప్రాంతంలో సెమెటిక్ జాతిప్రజలు, ఎక్కువగా హిబ్రూమతస్తులు, నివసించేవారు.

ఈ ఎడారిప్రాంతంలో మోసెస్‌కు ఆశ్రయమూ, దానితోపాటు తనకుమార్తెనూ ఇచ్చినవాడు జెత్రోఅనే ఒక మతగురువు. జెత్రోకు చాలా పశువులున్నాయి. ఆపశువులను మోసెస్ రోజూ మేతకు తోలుకొని వెళ్లేవాడు. ఎడారిలో అక్కడక్కడ కనపడే పచ్చికనేలలో పశువులు మేతమేస్తూ వుంటే, ఏచెట్టుక్రిందనో పడుకొని మోసెస్ ఆలోచించేవాడు.

ఈజిప్టురాజుకూతురు చెప్పించిన విద్యవల్ల ఆదేశస్థుల మతం, ఆచారాలు అన్నీ మోసెస్‌కు తెలుసు. తనతల్లి, సోదరి తమమతాన్నిగురించి వారికితెలిసినంతవరకు చెప్పారు. ఇప్పుడు తన మామగారివద్దనుంచి అబ్రహాంను గురించీ, ఆయనబోధనలనుగురించీ మోసెస్ పూర్తిగా తెలుసుకున్నాడు. అంతేకాదు, అసలు అబ్రహాం ఆశయాన్ని పూర్తిగా అవగాహన చేసుకున్నాడు. అబ్రహాంకోరినట్లుగా, హిబ్రూజాతి ప్రజలందరినీ జోర్డన్‌నదీ లోయప్రాంతంలోనూ, పశ్చిమాసియా తీరంలోనూ నివసించడానికి తీసుకొనివచ్చి, అబ్రహాం సంకల్పాన్ని నెరవేర్చాలని మోసెస్ ప్రతిజ్ఞ చేసుకున్నాడు. ఈజిప్టులోని హిబ్రూలు, వ్యక్తిత్వంలేని బానిసలుగా వుండటం, తమమూలపురుషుడు బోధించిన జెహోవామతాన్ని విస్మరించి ఈజిప్టుప్రజల మతాచారాలను అవలంబించడం మోసెస్‌కు ఆవేదనను కలిగించాయి.

ఎలాగయినా తన ప్రజలను ఈజిప్టునుంచి తీసుకొని వచ్చి జోర్డన్ లోయలో నిలబెట్టి, 'ఈ దేశం మీది' అని వారికి ఒక ప్రాంతాన్ని యిచ్చినట్లయితే, ఒక జాతిగా వారంతా ఒకే మతాన్ని అనుసరిస్తారని అతనికి తోచింది. తన సంకల్ప సిద్ధికి అతడు జెహోవాను ప్రార్థిస్తాడు. జెహోవా ఆశీర్వాదం లభిస్తుంది.

ఇంతలో, ఈజిప్టురాజు రామెసెస్ చనిపోతాడు. మినెప్టా రాజు అవుతాడు. మోసెస్‌కు విధింపబడిన మరణ దండన రామెసెస్‌తోపాటు కాలదోషం పట్టిపోతుంది. అందుచేత, ధైర్యంతో మోసెస్ ఈజిప్టు వెడతాడు.

మోసెస్ తనసోదరుడు ఆరన్‌ను కలుసుకొని తన ప్రతిజ్ఞను వివరిస్తాడు. బానిసత్వంలోనుంచి స్వేచ్ఛాజీవనానికి తమప్రజలను తీసుకొనివెళ్ళాలనీ, అబ్రహాం కలలుగన్న జోర్డన్‌లోయలో తమప్రజలకు నివాసం ఏర్పాటుచెయ్యాలనీ అన్నదమ్ములు నిశ్చయించుకుంటారు.

కొత్తదేశంలో స్వేచ్ఛగా జీవించవచ్చుననే మాట ఎలావున్నా, వందలమైళ్లు ఎడారిలోనుంచీ, అనేకజాతిప్రజల మధ్యనుంచీ బాధాకరమైన ప్రయాణం చెయ్యడానికి ఈజిప్టులోని హెబ్రూలు సులభంగా ఒప్పుకోరు. ఎంతపాటు పడవలసి వచ్చినప్పటికీ, తమ బానిసత్వంలో తమకు రోజూ మూడుపూట్లా ముద్ద దొరుకుతున్నది. స్వేచ్ఛకోసంపోతే, ఆముద్దకూడా దొరకదేమో అని వారు భయపడుతారు. వారందరికీ బోధించి, ఈజిప్టునుంచి వెళ్ళిపోవడానికి వారిని ఒప్పించడం అతికష్టంమీద మోసెస్, ఆరన్ సాధిస్తారు.

కాని, ఈజిప్టునుంచి వెళ్ళిపోవడ మెలాగ? దానికి రాజు అనుమతి కావాలి. మోసెస్, రాజువద్దకుపోయి తనప్రజలు ఈజిప్టునుంచి వెళ్ళిపోవడానికి అనుజ్ఞ అడుగుతాడు. రాజు నిరాకరిస్తాడు. అంతేకాదు. హిబ్రూలను ఎక్కువ కష్టపెడతాడు.

రాజును సుముఖుణ్ణి చెయ్యడానికి మోసెస్ అనేక విధాల ప్రయత్నిస్తాడు.

ఇంతలో ఈజిప్టులో అనేక ఈతిబాధలు కలుగుతవి. నైలునదిలో కప్పలు విశేషంగాపుట్టి దేశమంతా ప్రాకుతవి. వానలు కురవక పంటలు పండవు. పండిన కొద్దిపంటనూ మిడతలు తినివేస్తవి. ప్లేగువచ్చి జనం విశేషంగా చనిపోతారు. హిబ్రూలకోరిక నిరాకరించినందువల్ల వారిదేవుడు జెహోవా ఆగ్రహించి ఈజిప్టుకు యిన్నికష్టాలు తెచ్చిపెట్టాడని, మోసెస్ చెపుతాడు. ఈజిప్షనులు నమ్ముతారు.

ఎలాగయితేనేం, హిబ్రూలు ఈజిప్టునుంచి వెళ్ళిపోవడానికి రాజు ఒప్పుకుంటాడు.

## ఈజిప్టునుంచి ప్రయాణం

క్రీస్తుపుట్టుకకు పద్దమూడువందల సంవత్సరాలకు పూర్వం, ఒకానొకనాటి రాత్రి ఈజిప్టులోని పన్నెండు తెగలకు చెందిన హిబ్రూలు, తమసంసారాలతో, పశువులతో, సామగ్రితో, జోర్డన్‌లోయను ఆక్రమించుకోడానికి బయలుదేరుతారు. ఇలాబయలుదేరిన వారి సంఖ్య దాదాపు ఏడు లక్షలు అని బైబిలు చెపుతున్నది.

ఈజిప్టునుంచి, యీ ఏడులక్షలమంది హిబ్రూలు,

సినాఎడారిగుండా వారిగమ్యస్థానమైన జెరికో చేరుకోవ డానికి నలభై సంవత్సరాలు పట్టింది.

అనేక ప్రాంతాలలో కొన్నిమాసాలపాటు, కొన్ని ప్రాంతాలలో సంవత్సరాలపాటు, మకాంచేస్తూ, దారిలో అనేక తెగల ప్రజలతో యుద్ధాలుచేస్తూ, వారిపట్టణాలను భస్మంచేస్తూ, తమకు కావలసిన ఆహారపదార్థాలను దోచు కుంటూ, దోచుకోవడానికి వీలులేనిచోట ఎక్కువకాలం బసచేసి ఆహారధాన్యాలను పండించుకుంటూ, యీ హెబ్రూలు నలభై సంవత్సరాలు ప్రయాణం సాగించారు.

ఏడులక్షలజనం, రెండుతరాలపాటు ప్రయాణం సాగిస్తూవుంటే వారిలో వృద్ధులుకొందరు చనిపోతారు. యుద్ధాలలో యువకులు కొందరు చనిపోతారు. కాని కొత్త వారు పుడుతూనే వుంటారు. లక్షలజనం ఇలా ప్రయాణం సాగిస్తూ వుంటే, దారిపొడుగునావున్న అడవులలోని కల పను నరికి, ఎన్నో అరణ్యాలను నిర్మూలం చేయడం జరిగింది. వారిపశువులను మేపుకోవడంవల్ల ఎన్నోపచ్చికబయళ్ళు రూపులేకుండా పోయినవి. తమదేశాన్ని యిలాచేస్తున్నారే, వీరిని వారిద్దామని కత్తికట్టిన తెగలు ఎన్నో వీరిచేతిలో రూపులేకుండా పోయినవి.

ప్రయాణక్లేశాలను భరించలేక, యీహెబ్రూలలో కొందరు వెనక్కుతిరిగి ఈజిప్టుకు వెళ్ళిపోతామని మోసెస్ మీద అప్పుడప్పుడు తిరుగుబాటు చేసేవారు. వారందరికీ మోసెస్ నయాన, భయాన నచ్చజెప్పేవాడు. విననివారిని నిర్దాక్షిణ్యంగా నరికించివేసేవాడు.

సీన్ అంటే అరబ్బుభాషలో చంద్రుడని అర్థం. ఆ రోజులలో అరబ్బులకు చంద్రుడు ఒక ప్రధానదైవం. ఆ చంద్రునిపేర సినా అని ఒకపర్వతం వుంది. అదివున్న ప్రాంతానికి సినా అని పేరు. ఈనాటికీ ఆప్రాంతానికి అదే పేరు. ఈప్రాంతం ఈనాడు ఈజిప్టు పరిపాలనలోవుంది. ఇది సూయజ్ జలసంధికీ, అకాబాజలసంధికీ మధ్యను వుంది. మోసెస్, తన హిబ్రూప్రజలందరితోటీ యీ ప్రాంతంలోని సినాపర్వతందగ్గరకు చేరేటప్పటికి, ఆ ప్రజలలో ఒక తిరుగుబాటుభావం బాగా ప్రబలిందని గ్రహించాడు. ఈజిప్టులో కొన్నివందలసంవత్సరాలు వుండి ఈజిప్టుప్రజలవలెనే, అనేక దేవతలను, విగ్రహాలను ఆరాధించడం అలవరచుకున్న హిబ్రూలకు జెహోవాపట్ల విశ్వాసాన్నికలిగించి, ఒకే దేవుని పట్ల భక్తితత్పరతను కలిగిస్తేనేకాని వీరందరినీ ఏకజాతిగా ముందుకు నడిపించడం సాధ్యంకాదని అతడికి అర్థమైంది. వారందరినీ సినాపర్వతంవద్ద విడిదిదింపి, పెద్ద కోటకట్టి దానిలో వుండమంటాడు. తాను సినాపర్వతంమీదకు ఎక్కి, జెహోవాతో మాట్లాడి హిబ్రూజాతి అవలంబించవలసిన ధర్మాలు ఏమిటో తెలుసుకొని వస్తానని, మోసెస్ సినా పర్వతంమీదికి వెడతాడు.

ఆకొండమీద మోసెస్, నలభై రాత్రులు నలభై పగళ్లు గడిపి, జెహోవాఆదేశాలను తీసుకొనివస్తాడు. ఆ ఆదేశాలన్నీ రెండు పెద్ద రాతిపలకలమీద వ్రాసివుంటవి. మోసెస్, కొండదిగి వచ్చేటప్పటికి, క్రిందఉన్న హిబ్రూలు బంగారంతో ఒక ఆవుదూడరూపాన్ని తయారుచేసి అర్చిస్తూ

వుంటారు. మోసెస్‌కు చాలా ఆగ్రహం వస్తుంది. చేతిలో ఉన్న రాతిపలకలను క్రిందవిసరివేసి, హిబ్రూలు అర్చిస్తున్న బంగారువిగ్రహాన్ని క్రిందకులాగి దాన్ని ధ్వంసం చేస్తాడు. జెహోవాపట్ల అపచారంచేసి విగ్రహారాధనకు పూనుకున్న వారిని అణచివెయ్యమని తనఅనుచరులను ఆజ్ఞాపిస్తాడు. లెవి తెగకుచెందిన వారు మాత్రం అతనిఆజ్ఞను శిరసావహించి జెహోవాపట్ల అపచారంచేసిన వారిమీద పడతారు. ఒక్క రోజులో రెండువేలమందిని నరికివేస్తారు.

మరునాడు మోసెస్ మళ్లీ సినాపర్వతంమీదికి వెళ్లి జెహోవాఆదేశాలను రెండుపలకలమీద వ్రాసి తీసుకొని వస్తాడు.

## జెహోవా ఆదేశాలు

ఈ ఆదేశాలకే జెహోవాచెప్పిన పదిఆదేశాలు అని పేరు. అవి ఇవి.

హిబ్రూలు, జెహోవానుతప్ప వేరొకదేవుని ఆరాధించరాదు.

వారు ఏరకమైన విగ్రహాలను పూజింపరాదు.

జెహోవా పేరుకు కళంకం వచ్చేతీరున ప్రవర్తించరాదు.

ఆరురోజులుపనిచేసి, ప్రతిఏడవరోజున వారు విశ్రాంతి తీసుకోవాలి. ఆనాడు దేవుని అర్చించాలి.

తల్లిదండ్రులను గౌరవించాలి.

హత్య చేయకూడదు.

వ్యభిచారము చేయకూడదు.

దొంగతనం చేయకూడదు.

తప్పుడుసాక్ష్యం చెప్పకూడదు.

దురాశకులోనై, తమ యిరుగుపొరుగువారి ఆస్తి పాస్తులను హరించడానికి ప్రయత్నం చెయ్యకూడదు.

ఇవి, హిబ్రూజాతిలో ప్రతివ్యక్తీ పాటించవలసిన నియమాలు. ఈనియమాలను హిబ్రూలకు ప్రసాదించిన ప్రవక్త, మోసెస్.

దేవుని ఆరాధించాలంటే ఏదోఒక రూపకల్పన వుండాలి. అనేకవందలసంవత్సరాలు ఈజిప్టులోవుండి, ఆదేశపుప్రజలు విగ్రహరూపంలో దేవుళ్లను ఆరాధించడం, అరాధన కార్యక్రమాలను నిర్వర్తించడానికి అనేకపూజారులు వుండటం చూసిన హిబ్రూలకు, ఏవిధమైన రూపం తెలియని జెహోవాను ఆరాధించడమంటే విశ్వాసం కుదరకపోవచ్చును. పూజాకలాపం ఏర్పరచకపోతే, భక్తివిశ్వాసాలను ప్రకటించే మార్గంవుండదని మోసెస్ భావించాడు. కాని, జెహోవాకు రూపకల్పనచేసి, విగ్రహాన్ని తయారుచెయ్య కూడదు గదా!

అంచేత, ఓడరూపంలో ఒకపెట్టెను తయారుచేయించాడు. ఆపెట్టెకు వెండిబంగారాలతో నగిషీలు చెక్కించాడు. దానికి తెబా అని పేరు. తెబా అంటే పెట్టెఅని అర్థం పేరు. జెహోవాను అర్చించేవారు ఆ తెబాను అరాధించాలి. ఆరాధనసమయంలో, జెహోవా ఆతెబాలోకి వచ్చి అర్చనలను స్వీకరిస్తాడు. ఆతెబాకు లాటిన్ పదం, ఆర్కా. అదే ఇంగ్లీషులో ఆర్క్. దీనినే దేవాలయంగాభావించి

హెబ్రూలు తమతోపాటు ఒకచోటునుంచి మరొకచోటికి మోసుకొని పోయారు.

అర్చనకలాపం ఏర్పాటుచేసినప్పుడు అర్చకులు కావాలికదా! తాను సినాయ్‌పర్వతంమీద వున్నప్పుడు తనపట్ల విశ్వాసంతో నిలబడిన లెవి తెగవారిని జెహోవాకు అర్చకులుగా మోసెస్ నియమించాడు. ఈనాటికీ, యూవంశీకులే యూదు దేవాలయాలలో అర్చకులు.

తనతో ముందుకుసాగుతున్న అనేకమంది ప్రజలలో చిల్లరతగాదాలను తీర్చడానికి కులపెద్దలను మోసెస్ నియమించాడు.

అంతేకాక, జెహోవాకు ప్రజలుఅర్పించవలసిన కానుకలు, పూజాకలాపం ఏవిధంగా జరపవలసిందీ, ప్రజలు తమ శుచిత్వాన్ని ఏవిధంగా కాపాడుకోవలసిందీ, వివాహములకు పాటించవలసిన గోత్రనియమాలు మొదలైన విషయాలన్నిటికీ కొన్ని ధర్మసూత్రాలను నిర్ణయించాడు.

ఈవిధంగా, జాతికి కట్టుదిట్టాలను ఏర్పాటుచేసి, సినా ప్రాంతంనుంచి ఉత్తరంగా కానాన్ దేశానికి ప్రయాణం సాగించాడు. కాని, దారిలో మోసెస్ చనిపోతాడు. మోసెస్ అనంతరం, హెబ్రూలకు జోషువా అధిపతిఅవుతాడు.

జోషువానాయకత్వంలో, హెబ్రూలు తమప్రయాణాన్ని ముందుకు సాగిస్తారు.

నలభై వేలమంది సైనికులతో, యుద్ధంచేసుకుంటూ జోషువా ముందుకు సాగుతాడు. జెరికో పట్టణాన్ని స్వాధీనం చేసుకొని, కోటలను విధ్వంసంచేసి, పట్టణంలోని

ప్రజలను స్త్రీ పురుష, బాల, వృద్ధ భేదం లేకుండా అందరిని చంపివేస్తాడు.

ఒకటితరువాత ఒకటిగా, ఐ, జిబియన్, షిలో, షెకెం, గిల్గాల్ పట్టణాలు జోషువాకు స్వాధీనమౌతవి. ఒక్క జిబియన్ పట్టణవాసులను తప్ప, మిగతాపట్టణాలలోని ప్రజలను హిబ్రూలు చంపివేస్తారు. జిబియను పట్టణవాసులను తమకు బానిసలను చేసుకుంటారు.

జెరుసలేం, హెబ్రాన్, లషీష్, ఎగ్లాన్, జార్ముత్ పట్టణాలరాజులను భయకంపితులను చెయ్యడానికి. అయిదుగురు రాజులను నిర్దాక్షిణ్యంగా చంపివేస్తారు.

ఈవిధంగాహిబ్రూలు, కానాన్ దేశాన్ని, జోర్డాన్ లోయనూ ఆక్రమించుకుంటారు. కానాన్ ప్రాంతంలో, హిబ్రూలురాకపూర్వం ఫిలిస్టిన్ తెగప్రజలు వుండేవారు. అందువల్ల ఆప్రాంతానికి పాలస్తీనా అని పేరు వచ్చింది.

పాలస్తీనాలో హిబ్రూలు స్థిరపడ్డారు. ~~జోర్డాన్, పాలస్తీనా దేశాలలో.~~

## రాజరికం

హిబ్రూ తెగలు పన్నెండుమంది కులపెద్దల పరిపాలనలో వుండేవి. ఈ తెగలు పాలస్తీనా, జోర్డన్ లోయలలో నివసిస్తూ, జెహోవాను ఆరాధిస్తూ మూడువందలసంవత్సరాలు గడిపాయి. అప్పుడు వారికి తమదేశానికి ఒకరాజును ఏర్పాటుచేసుకోవాలని బుద్ధిపుడుతుంది. సాల్ అనే ఒక భూస్వామిని రాజుగా ఎన్నుకుంటారు.

సాల్ తరువాత డేవిడ్ రాజుఅవుతాడు. డేవిడ్ తరు

వాత, అతనికుమారుడు సోలమన్ రాజు అవుతాడు. సోల మన్ తనకాలంలో, జెరుసలేంపట్టణంలో ఒకగొప్ప దేవా లయం నిర్మిస్తాడు. చుట్టుప్రక్కల చిన్నచిన్న రాజ్యాలను జయించి ప్రబలుడైనరాజుగా పరిపాలనచేస్తాడు.

సోలమన్ తరువాత హిబ్రూరాజ్యం విచ్ఛిన్నమవు తుంది. ఇస్రేల్ రాజ్యం, జుడారాజ్యం అనేపేర్లతో రెండు రాజ్యాలు అవుతుంది. వీరిలోవీరికి కలతలవల్ల, యూదుజాతి బలహీన మవుతుంది.

సోలమన్ మరణానంతరం, రెండువందల సంవత్సరా లకు, ఈరాజ్యాలపైన బేబిలోనియన్ రాజులు దండెత్తి, జయించి, కొన్నివేలమంది హిబ్రూలను బానిసలుగా బేబి లాన్ తీసుకొనిపోతారు. జెరుసలేంలోని దేవాలయాన్ని ధ్వంసం చేస్తారు.

ఈజిప్టులో బానిసత్వాన్ని బాపుకొని, స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించుకున్న ఏడువందల సంవత్సరాలకు హిబ్రూలు మళ్ళీ బానిసలవుతారు.

ఈబానిసత్వంలో, హిబ్రూల పన్నెండు తెగలలోనూ పదితెగలు నామరూపాలు లేకుండా పోతవి. బహుశా, వీరంతా జెహోవామతాన్ని విస్మరించి, యితరదేవుళ్ళ ఆరా ధనను అవలంబించివుంటారు. పరిసర తెగలలో కలిసిపోయి వుంటారు.

బేబిలాన్‌లో హిబ్రూలు కేవలం బానిసవృత్తిలో జీవించలేదు. వ్యాపారం చేసుకున్నారు; వ్యవసాయం చేసు కున్నారు; తమదేవునే అరాధించేవారు; తమ ఆచారాలనే

పాటించేవారు. కాని, తమ దేశాన్ని వదలి నిర్బంధంగా బేబిలాన్‌లో వుండటంమాత్రం వారికి బాధగా వుండేది.

ఇలా ఒక యాభై సంవత్సరాలు గడిచేటప్పటికి, బేబిలాన్‌ను పెర్షియనులు జయించారు. పెర్షియన్ రాజు సైరస్ (కురు), హిబ్రూలను తిరిగి తమదేశానికి వెళ్ళిపోనిచ్చాడు. జెహోవాను ఆరాధించే యీ ప్రజలను జెహూదీలు అని పెర్షియనులు పిలిచేవారు. జెహూది అనేపదం జ్యూ అయింది. అదే రూపాంతరంలో యూదు అయింది. అంటే పెర్షియనులతో సంబంధం వచ్చినతరువాత, హిబ్రూలకు యూదులనే పేరు వచ్చిందన్నమాట.

సైరస్ రాజు, యూదులను తమస్వదేశానికి వెళ్ళనివ్వడమేకాక, జెరుసలేంలోని తమ దేవాలయాన్ని తిరిగి కట్టుకోవడానికి వారికి సహాయం చేశాడు.

పర్షియనుల సంబంధంవల్ల జొరాస్టర్ మతంలోని కొన్ని సూత్రాలను యూదులు గ్రహించారు. ప్రపంచానికి ఒకే దేవుడు అని నిశ్చయించాడు. అదేవుడే జెహోవా.

జెహోవాకు రూపకల్పన చెయ్యరాదు. కాబట్టి, విగ్రహారాధన పనికిరాదు.

యూదులను తమదేశానికి వెళ్ళనిచ్చినా, వారిమీద అధికారాన్నిమాత్రం పెర్షియనులు వదులుకోలేదు. పాలస్తీనా పెర్షియనుల పరిపాలనలోనే వుంది. పెర్షియనులను ఓడించిన గ్రీకులు, పెర్షియన్ సామ్రాజ్యంతోపాటు పాలస్తీనాను పరిపాలించారు. గ్రీకుల అనంతరం రోమనులు, పాలస్తీనాను తమసామ్రాజ్యంలో ఒకభాగం చేసుకున్నారు.

రోమనుల తరువాత మళ్లీ పెర్షియనులు, వారితరువాత అర బ్బులు యీ ప్రాంతంమీద పరిపాలనచేశారు.

మొదటి ప్రపంచయుద్ధానంతరం, పాలస్తీనా బ్రిటను అధికారంలో మాండేటరీరాజ్యంగా వుంది. రెండవ ప్రపంచ యుద్ధానంతరం, 1948 మే 15 వ తేదిన ఇస్రేల్ అనేపేరుతో స్వతంత్ర యూదురాజ్యం స్థాపించబడింది.

రెండువేలసంవత్సరాలు యూదులు, తమదేశంఅనేది వున్నా, రాజ్యంఅనేది లేకుండా వున్నారు.

యూదు మతానికి మూలపురుషుడు అబ్రహాం. ఈ మతానికి ధర్మసూత్రాలను సృష్టించినవాడు మోసెస్. అబ్రహాంకాలంనుంచి యీనాటికి యూదుమతంలో అనేక మంది ప్రవక్తలు ఉద్భవించారు. అప్పటికీ, యిప్పటికీ మత విశ్వాసాలలో మార్పులు చాలా వచ్చాయి.

మోసెస్ చెప్పిన పదినియమాలలో మొదటిది, జెహోవానుతప్ప మరొక దేవుని హిబ్రూలు ఆరాధించరాదు, అని. అంటే, జెహోవాకాక యితరదేవుళ్లుకూడా వున్నారని ఆనాటిహిబ్రూలు భావించేవా రన్నమాట. మోసెస్ చెప్పిన మతనియమాలలో కొన్ని ఆనాడు ఈజిప్షనులు అనుసరించేవే. అంతేకాదు, ఈజిప్షను దేవాలయాలలో జరిగే పూజాకలాపాన్నీ, కానుకలను అర్పించే ఆచారాన్నీ మోసెస్ తనఅనుచరులకు బోధించాడు.

తరువాత, పెర్షియనులతో సంబంధంవల్ల జొరాస్టర్ మతధర్మాలలో అనువైనవాటిని యూదులు గ్రహించారు.

ఈవిధంగా, యూదుప్రజలజీవితాన్నిబట్టి, వారిమతం

క్రమానుగత మార్పును పొందింది. అంచేతనే యూదుమత చరిత్ర చెప్పాలంటే, ఏఒకప్రవక్తచరిత్రనో చెపితే చాలదు. యూదుజాతి ప్రారంభదశనుంచీ, ఆజాతి చరిత్రనే చెప్పుకు రావాలి.

# పార్శీ మతం

మనదేశంలోని ప్రతి పెద్ద పట్టణంలోనూ పార్శీ మతస్తులు వున్నారు. బొంబాయిలో వీరిజనాభా, ఇతరపట్టణాలలో కంటె ఎక్కువ. భారతదేశంలోవున్న పార్శీలసంఖ్య, సుమారు 1,12,000. వీరంతా, ముఖ్యంగా వ్యాపారస్తులు. వీరిలో బీదవాళ్లు మనకు కనపడరు. ముప్ఫయి అయిదుకోట్ల భారతదేశపు ప్రజలలో పార్శీలు ఒక పరిగణనీయమైన తెగ కావడానికి, వారంతా చక్కని జీవనోపాధి కలిగివుండటమే కాక, ప్రపంచంలోని అతిపురాతనమైన మతాన్ని వారు యీనాటికీ పాటిస్తూవుండటంకూడా ఒకముఖ్యకారణం.

పార్శీలకు ఆపేరురావడానికి కారణం, వారు పెర్షియా దేశంనుంచి మనదేశానికి వలసరావడం. పెర్షియామీద అరబ్బులు దాడిచేసి, ఆదేశప్రజలను ఇస్లాంమతంలో బలవంతంగా చేర్చడంవల్ల, తమపూర్వీకులమతాన్ని వదలడానికి ఇష్టంలేని ఫారశీకులు కొంతమంది క్రీస్తుశకం 775 సంవత్సరంలో బొంబాయికి వలసవచ్చేశారు. ఆనాడు గుజరాత్ దేశాన్ని పాలిస్తున్న రాజు ఫారశీకులకు ఆశ్రయమిచ్చాడు. అప్పటినుంచీ, ఆఫారశీకులు భారతదేశంలోనే స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. వారిసంతతివారే మనదేశంలోని అనేకపట్టణాలలో నేడు కనపడుతున్నారు.

వీరు అవలంబించే మతానికి జరతుష్ట్రమతం అని పేరు. ఆమతాన్ని బోధించిన ప్రవక్త పేరు జరతుష్ట్ర.

ఆయననే ఆంగ్లభాషలో జొరాస్టర్ అనీ, ఆమతాన్ని జొరాస్ట్రియనిజం అనీ అంటారు. అయితే, వాడుకలో భారత దేశంలోమాత్రం, పార్శీమతం అంటారు.

ఈమతాన్ని అవలంబించేవారు ప్రధానంగా భారత దేశంలోనే వున్నా, సుమారు పదివేలమంది యీనాటికీ పెర్షియాలోని ఎజద్‌లో ఒకప్రత్యేక తెగగా జీవిస్తూ వున్నారు. వీరికీ, భారతదేశంలోని పార్శీలకూ సంబంధాలు దాదాపు పన్నెండువందల సంవత్సరాలనాడే తెగిపోయి నందున, వేష భాషలలోనూ, ఆచార వ్యవహారాలలోను వీరిమధ్య కొన్ని మార్పులు వచ్చినవి. అయితే వీరిమతానికి సంబంధించినంతవరకు మూలసూత్రాలుమాత్రం ఏమీ మారలేదు.

జరతుష్ట్రి తనమతాన్ని బోధించడానికి పూర్వం పెర్షియాలోని ప్రజలు అనేకదేవతలను ఆరాధించేవారు. అహురమజ్ద (అసురమర్ద) అనేదేవుడు ఒక్కడేననీ, అతడినే ఆరాధించాలనీ ఆయన బోధించాడు. ఆరోజులలో పెర్షియా ప్రజలంతా ఆమతాన్ని అవలంబించినా, కాలక్రమేణ మళ్ళీ కొన్నిపాతపద్ధతులను తెచ్చిపెట్టుకొని "ఏకదేవ" మతం నుంచి 'బహుదేవ' మతంలోకి మారారు. అందుచేత, ఈనాడు పార్శీలు అవలంబించే మతం పూర్తిగా జరతుష్ట్రి బోధించినదే అని చెప్పడానికి వీలులేదు.

అతిపురాతనకాలంలో, అంటే దాదాపు 4000సంవత్సరాలనాడు (క్రీస్తుకుపూర్వం సుమారు 2000ఏండ్లనాడు), భారతదేశంలో స్థిరనివాసం ఏర్పరచుకొనడానికి వచ్చిన

ఆర్యులూ, పెర్షియా దేశంలోని ఇరాన్ ప్రాంతంలోని ఇరేని యనులు ఒకేజాతివారు. బహుశా, ఇరాన్ ప్రాంతంనుంచే ఆర్యులు భారతదేశానికి వచ్చివుంటారు. ఇలాఅనడానికి కారణాలు చాలా ఉన్నాయి. ఆనాడు ఆర్యులమతమూ, ఇరేనియనులమతమూ ఒకటే. "అవెస్తా"లోని కొన్ని భాగాలూ, ఆర్యుల ఋగ్వేదంలోని కొన్ని భాగాలూ ఒకటిగానే కనుపిస్తాయి. ఇరేనియనులు నివసించే ప్రాంతానికి మొదటిపేరు, 'ఆర్యనివాసో.' ఈపేరే క్రమంగా రూపాంతరంపొంది, ఇరాన్ అయింది.

భారతదేశానికి వచ్చిన ఆర్యులు, ఇచ్చట అంతకు పూర్వమే నివాసం ఏర్పరచుకున్న ప్రజల వేషభాషలనూ, ఆచారవ్యవహారాలనూ, మతధర్మాలనూ, సాంఘికవ్యవస్థలనూ క్రమంగా అవలంబించారు. అందువల్లనే జరతుష్ట్ర తన బోధనలలో యీ ఆర్యుల పద్ధతులను కొన్నిటిని నిరసించడం కూడా కనపడుతుంది.

భారతదేశానికివచ్చిన ఆర్యులకూ, ఇరాన్‌లో వుండి పోయిన ఆర్యులకూ మధ్య సంబంధబాంధవ్యాలు లేకపోయినా, రాకపోకలు పూర్తిగా తెగిపోలేదని ఊహించవచ్చును. ఇస్లాంమతంలో చేరడానికి ఇష్టపడని పెర్షియనులు భారతదేశానికి వలసరావడానికి కారణం అదే. కొన్నివేల ఏండ్లనాడు తమజాతిప్రజలు భారతదేశం వెళ్ళి స్థిరవాసం ఏర్పరచుకున్నారుకదా, తాముకూడా అలాగే స్థిరపడవచ్చునసే భావంతోనే పార్శీలు భారతదేశానికి వలస వచ్చివుంటారు.

ఈనాడు పార్శీలమతంలో అగ్ని ఆరాధనకు ప్రధాన స్థానం ఇవ్వబడుతున్నది. 'అగ్ని, జలము, భూమి, వీరికి ఆరాధనీయములు.

ఇతరమతస్థులవలె, పార్శీలు తమశవాలను పాతి పెట్టరు; అగ్నిలో దగ్ధంచెయ్యరు; సముద్రంలో పారవెయ్యరు. తమకు అతిపవిత్రములైన అగ్నినీ, భూమినీ, జలమునూ శవ స్పర్శవల్ల మలినపరచడం వారు సహించజాలరు. అంచేత, పార్శీలు తమమతస్థులలో ఎవరైనా చనిపోతే, ఆ శవాన్ని ఎత్తయిన ఒక శిఖరంమీదగాని, కొండమీదగాని పెట్టి వేస్తారు. రాబందులు ఆశవాన్ని తినివేస్తాయి.

## జ ర తు ష్ట్రి

జరతుష్ట్రి జననకాలాన్ని గురించి వాదోపవాదాలు చాల ఎక్కువగా వున్నాయి. ఆయన క్రీస్తుపూర్వం వెయ్యి ఏండ్లనాడు జన్మించినాడని కొందరు వాదిస్తారు. కాని, క్రీస్తు పూర్వం 660 సంవత్సరంలో ఆయన జన్మించాడనీ, క్రీ. పూ. 583 సంవత్సరంలో జీవితాన్ని చాలించాడనీ ఒకవాదం. దీనినే ఎక్కువమంది చరిత్రకారులు బలపరుస్తున్నారు.

జరతుష్ట్రి జననంమొదలు, ఆయన దేహం చాలించే వరకూ ఆయన జీవితాన్ని గురించినవి అద్భుతమైన కథలు ఎన్నో వున్నాయి.

కాస్పియన్ సముద్రానికి పశ్చిమాన అజెర్‌బైజన్ అనే ఊరు వుంది. ఈనాడు ఆప్రాంతం సోవియెట్ రష్యాలో ఒకభాగం. జరతుష్ట్రి జన్మస్థానం, ఆ అజెర్‌బైజన్. తండ్రి, పురుషస్ప స్పితమ; తల్లి, దుగ్ధోవ.

జరతుష్ట్ర దైవాంశసంభూతుడని ఒక కథ వుంది. దేవదూత సోమరసంద్వారా పురుషస్ప శరీరంలో ప్రవేశించాడు. దేవునిఅంశ కిరణరూపంలో దుగ్ధోవశరీరంలో ప్రవేశించింది. వీరిరువురి కలయికతో దేవదూత దుగ్ధోవగర్భంలో చేరి దైవాంశతో జరతుష్ట్రగా జన్మించాడు.

ఒక కొత్తమతస్థాపకుడు అవతరించాడనే భయంతో, ఆనాటి రాజపురోహితుడు భయపడి, జరతుష్ట్రను చంపించడానికి అనేకప్రయత్నాలు చేస్తాడు. కాని, ఏవీ ఫలించవు. జరతుష్ట్రనుగురించి ఇలాంటి గాథలు చాలా వున్నాయి.

జరతుష్ట్ర పెరిగి పెద్దవాడై, తనచదువును పూర్తి చేసుకొంటాడు. ఇరాన్‌కూ తురాన్‌కూ మధ్య యుద్ధం వస్తుంది. క్షతగాత్రులకు జరతుష్ట్ర చికిత్సచేస్తాడు. తరువాత, దేశంలో కాటకం వస్తుంది. రోగాలతోబాధపడే ప్రజలకు ఆయన సేవచేస్తాడు.

తరువాత కొన్నాళ్ళకు, హవోవీఅనేకన్యను జరతుష్ట్ర వివాహం చేసుకుంటాడు. కాని, సంసారంమీద ఆయన మనసు నిలువలేదు. ప్రపంచంలో ప్రజల సుఖదుఖాలకు కారణంఏమిటనే ఆలోచన ఆయనను విడువదు. సత్యాన్వేషణకోసం, ఆయన సంసారాన్ని వదలి శబల పర్వతానికి వెళ్ళి, అక్కడ చాలారోజులు దీక్షతో గడుపుతాడు. అహోరాత్రాలు ఆలోచనలో గడచిపోతాయి.

ఒకరోజు సాయంకాలం, అస్తమిస్తూవున్న సూర్యుని చూస్తూ, ఆలోచిస్తూవుంటే ఆయనకు హఠాత్తుగా ఒక

భావం కలుగుతుంది. తానుఅన్వేషిస్తున్న వెలుగు కనపడిం దని ఆనందపారవశ్యు డవుతాడు.

జరతుష్ట్రకు తోచినభావం ఇది: సూర్యుడువున్నంత సేపూ లోకంఅయన వెలుతురుతో నిండివుంది. సూర్యుడు అస్తమించగానే లోకాన్ని చీకటి ఆవరించింది. వెలుతురు వున్నప్పుడు చీకటి లేదు. చీకటిలో వెలుతురు లేదు. అలాగే ప్రపంచంలో మంచి, చెడు అనేవి రెండు వున్నాయి. మంచిలో చెడు ఎప్పుడూ వుండదు. చెడులో మంచికలవదు.

ప్రపంచంలో మంచినికలిగించే దేవుళ్లు వేరు; చెడును కలిగించే దేవుళ్లు వేరు. మంచిదేవుళ్లు చెడు చెయ్యరు; చెడ్డ దేవుళ్లు మంచిని చెయ్యరు. ప్రజలకు సుఖంకలిగించే మంచి దేవుడు, అసురమర్ద; బాధలుకలిగించే చెడ్డదేవుడు, అంగ్ర మన్యు.

అసురమర్దకు ఆరుగురు దూతలు వున్నారు.

సద్బుద్ధి : వోహుమన

సదాచారము : ఆషవహిష్ట

క్షత్రవీర్య : క్షత్రవైర్య

భూదేవ : స్పెంట ఆర్మైతి

ఆరోగ్యము : హౌర్వతాత్

అమరత్వము : అమరెతత్

ఈదేవదూతలకు 'అమెషస్పెందు' లని పేరు. ఈదూ తలద్వారా, అసురమర్ద సందేశాలను తనకు వినిపించేవాడని జరతుష్ట్ర చెప్పేవాడు.

అసురమర్దసందేశాలను ప్రజలకు వినిపించి, వారిని సన్మార్గంలో పెట్టడానికి జరతుష్ట్ర సంకల్పించుకున్నాడు.

సత్ప్రవర్తనమే సర్వోత్తమమైన మార్గము – అషేమ్ వోహు వహిష్టం అస్తి – అనే ధర్మాన్ని బోధించడానికి నిశ్చయించుకొని, ఇరాన్, ఆఫ్ఘనిస్తాన్, తురాన్ దేశాలలో తన ధర్మాన్ని బోధిస్తూ ఆయన సంచరిస్తాడు. కాని, ప్రజలు ఆయనబోధలను సరకుచెయ్యరు.

స్వజాతి, స్వబంధు వర్గంలోనివారే వివాహాలుచేసుకోవాలని జరతుష్ట్రబోధించేవాడనీ, అందువల్ల ప్రజలకు ఆయన మతంమీాద ఎక్కువఅభిమానం కలుగలేదనీ చరిత్రజ్ఞుల అభిప్రాయం.

## ప్రధాన సూత్రాలు

జరతుష్ట్రబోధించిన మతంలో ప్రధానసూత్రాలు ఏవంటే:

వ్యవసాయము, పశువులపెంపకము – ఇవిరెండే మానవుడు అనుసరించదగిన ఉత్తమవృత్తులు.

సత్ప్రవర్తనము, దుష్ప్రవర్తనము – ఈరెండిటి సంఘర్షణే ఈలోకం.

భూమి, అగ్ని, వాయువు, నీరు – ఈనాలుగూ అతి పవిత్రములైనవి. వీనిని మలినపరచరాదు.

'జరతుష్ట్ర' మతస్తులు జపించే ప్రధానమంత్రం ఇది:

హుమత, హుఖ్త, హ్వర్షత

అంటే :— సుమనః, సువాక్, సుకర్మ.

"దేవుడా, నామనస్సు మంచిదిగా వుండాలి; నావా

క్కులు మంచివిగా వుండాలి; నాచేతలు మంచివిగా వుండాలి.'' ఇది ఆమంత్రం అర్థం.

జరతుష్ట్రి తనమతాన్ని బోధించడం మొదలుపెట్టిన తరువాత పదిసంవత్సరాలలో ఆయనకు లభించిన శిష్యుడు ఒక్కడే. అతడు జరతుష్ట్రి దాయాది, మైధ్యోయి - మాణ. తరువాత రెండేళ్లకు జరతుష్ట్రికు నిజమైనవిజయం లభించింది. అది, ఇరాన్ రాజు విష్టస్ప జరతుష్ట్రిమతాన్ని స్వీకరించడం.

జరతుష్ట్రి యీవిజయాన్ని పొందడాన్నిగురించి అనేకమైనకథలున్నాయి. మొదట్లో, ఆయనకు రాజప్రాసాదంలోనికి ప్రవేశమే లభించలేదు. అప్పుడు ఆయన అరచేతిలో అగ్నిగోళాన్నిపట్టుకొని రాజభటులకు తనమహాత్మ్యను చూపిస్తాడు. అప్పుడు, వారువెళ్లి 'ఒకమహాపురుషుడు తమ దర్శనానికు వచ్చాడు' అని రాజుకు చెప్తారు. రాజాజ్ఞ అవుతుంది. జరతుష్ట్రి రాజువద్దకువెళ్లి, తనమతాన్ని స్వీకరించమని కోరుతాడు. రాజు సులభంగా అంగీకరించడు. రాజాస్థానంలో వున్న పురోహితులకూ జరతుష్ట్రికూ మూడు రోజులు వాదోపవాదాలు జరుగుతవి.

''లోకానికి సర్వజ్ఞుడైన దేవుడు ఒక్కడే వున్నాడు. అతడు అహురమజ్ద. ప్రపంచాన్ని సృష్టించినది అతడే. అతడికి ప్రతిస్పర్థిగా అంగ్రమన్యు ఉన్నాడు. లోకంలోని చెడ్డతనానికి దుఃఖానికి కారకుడు అంగ్రమన్యు.

''మనుష్యులను సృష్టించినది, అహురమజ్ద. మనుష్యులకు ఆయన స్వేచ్ఛను ప్రసాదించాడు. అందువల్ల వారు

అంగ్రమన్యుమాయలోపడి చెడుమార్గాలలో నడుస్తున్నారు. మనుష్యుడు చనిపోయినతరువాత, అతడు యీలోకంలో చేసిన మంచిపనులు ఎక్కువగావుంటే, అతడిఆత్మ స్వర్గానికి పోతుంది; చెడ్డపనులు ఎక్కువగావుంటే, అతడిఆత్మ నరకానికి పోతుంది.

"లోకానికి త్వరలో ప్రళయం వస్తుంది. అప్పుడు దుర్మార్గత నశిస్తుంది. సన్మార్గులతో ప్రపంచం ఆనందమయంగా వుంటుంది."

ఈవిధంగా జరతుష్ట్రి రాజసభలో తనమతాన్ని బోధిస్తాడు. చివరకు, రాజు జరతుష్ట్రిమతాన్ని స్వీకరిస్తాడు. జరతుష్ట్రిను తనప్రధాన పురోహితునిగా నియమిస్తాడు,

రాజు తరువాత, రాణి హుతౌష, రాజబంధువులు, అనేకమందిప్రజలు కొత్తమతాన్ని అవలంబిస్తారు. ప్రధానమంత్రిసోదరిని తనమూడవభార్యగా జరతుష్ట్రి వివాహం చేసుకుంటాడు. తనసోదరిని మంత్రికి వివాహం చేస్తాడు. ఈవిధంగా జరతుష్ట్రి రాజవర్గంలో పలుకుబడినీ, ప్రతిష్ఠనూ పొంది, తనమతాన్ని విరివిగా ప్రచారం చేస్తాడు. ఆరోజులలో ఆవుల చర్మాలను బాగా వూని, వాటిమీద గ్రంథాలను వ్రాసేవారు. జరతుష్ట్రి బోధలన్నీ 12,000 చర్మాలమీద వ్రాయబడినవట. అతడి బోధనలన్నిటికీ 'అవెస్తా' అనిపేరు. దానిలో అతడు దేవుని సంబోధించి, వ్రాసిన గీతాలకు 'గాథ' లని పేరు.

జరతుష్ట్రి డెబ్బది ఏడేండ్లు జీవించాడు. తనమతాన్ని చాలా పట్టుదలతో ప్రచారం చేయించాడు, ఇరాన్ పౌరు

గునవున్న తురాన్ దేశస్తులకు యీమతం రుచించలేదు. వారు ఇరాన్‌పై దాడిచేసి, ఒక ఆలయంలో ప్రార్థనచేస్తున్న జరతుష్ట్రను చంపివేస్తారు.

జరతుష్ట్రను చంపిన తురాన్‌ప్రజలపై పగతీర్చుకుంటానని రాజువిష్టస్ప ప్రతిజ్ఞచేసి, తురాన్‌పై దాడిచేసి, ఆప్రజలందరిచేతా జరతుష్ట్రమతాన్ని స్వీకరింపచేస్తాడు.

అప్పటినుంచీ జరతుష్ట్రమతం బాగా విస్తరిల్లుతుంది. కాని అలెగ్జాండరు దండయాత్రవల్ల ఈమతానికి ఒక గొప్ప నష్టం కలుగుతుంది. పెర్షియాను జయించిన అలెగ్జాండర్, రాజధాని పెర్సినగరంలో ఒకరాత్రి విందారగిస్తూవుంటాడు. అతడి సేనాపతులు, వారిభార్యలు, అందరూ విందులో బాగా మద్యపానం చేస్తారు. వారిలో ఒక అందగత్తె, 'పెర్సినగరానికి నిప్పుపెట్టి తగలబెట్టుదామా' అని అలెగ్జాండరును రెచ్చగొట్టుతుంది. ఒళ్లు తెలియకుండా త్రాగిన అలెగ్జాండరు, ఆమాటవినగానే ఒక కాగడాతీసుకొని భవనాలకు నిప్పు అంటించడం ఆరంభిస్తాడు. అతడితోబాటు, స్త్రీ పురుష భేదంలేకుండా అతడి అనుచరులంతా కాగడాలు తీసుకొని భవనాలకు నిప్పుపెడతారు.

కైపుతగ్గి తనుచేసిన తప్పును అలెగ్జాండరు తెలుసుకొనేటప్పటికి, పెర్సినగరం పూర్తిగా అగ్నిజ్వాలలతో వెలుగుతూ వుంటుంది. వెంటనే మంటలనుచల్లార్చమని అలెగ్జాండరు తనసైనికులను ఆజ్ఞాపిస్తాడు. కాని, ప్రయోజనం వుండదు. ఆమహాపట్టణం ఏకొద్దిభాగమోతప్ప, పూర్తిగా దగ్ధమై పోతుంది.

ఈ అగ్నిలో అవెస్తాగ్రంథం పూర్తిగా భస్మమై పోతుంది. అయితే, ఆనాటిపురోహితులు తమకు కంఠస్థమైన భాగాలనూ, జ్ఞాపకంవున్న విషయాలనూ మళ్ళీ గ్రంథంగా వ్రాస్తారు. అసలు 'అవెస్తా' లో ఇది చాలా స్వల్పభాగం మాత్రమే. అంచేత యీనాడులభించే అవెస్తాగ్రంథం యథాతథంగా జరతుష్ట్రచెప్పింది కాదు. పురోహితులు కంఠస్థం చేసుకున్న భాగాలుతప్ప, జ్ఞాపకశక్తిమీద ఆధారపడి వారు వ్రాసిన విషయాలలోని భాష జరతుష్ట్రకాలంనాడు పెర్షియాలో వాడుకలోవున్న భాష కాదు. అందువల్లనే నేడులభించే అవెస్తాలోని భాషఅంతా ఒకేతీరుగా వుండదు.

అలెగ్జాండరు దండయాత్రవల్ల అవెస్తాగ్రంథం దెబ్బ తిన్నప్పటికీ జరతుష్ట్రమతంమాత్రం దెబ్బతినలేదు. ఈమతం బాగాదెబ్బతిన్నది, అరబ్బుల దండయాత్రవల్ల. ఇస్లాంమతం పెర్షియాలో ప్రబలంగా వ్యాపించడంతో, జొరాస్ట్రియన్ మతం క్షీణించిపోయింది. సుమారు పదివేలమందిమాత్రం, యీనాడు పెర్షియాలో ఈమతాన్ని అవలంబిస్తున్నారు.

సుమారు 1200 సంవత్సరాలు మహోజ్జ్వలంగా పెర్షియాలో ప్రబలిన యీ మతాన్ని పాటించేవారి సంఖ్య, యీనాడు ఒకలక్షపైన మాత్రమే.

జొరాస్ట్రియనులసంఖ్య తక్కువైనప్పటికీ, ప్రపంచంలోని ప్రధానమతములలో యీనాటికీ ఇది ఒకటి. అంతేకాక, యీనాటి ప్రధానమతములలో కొన్నిటిమీద జొరాస్ట్రియన్ మతపు ప్రభావం కొంత పడకపోలేదు. ఏమంటే,

నేటి గొప్పమతాలు కొన్నిటిలో యీమతధర్మాలు కొన్ని మిళితమై వున్నాయి.

## అవెస్తా

పార్శీమతస్తుల పవిత్రగ్రంథంపేరు 'జెంద్ అవెస్తా.'

అవెస్తా అంటే మూలగ్రంథం అని అర్థం. జెంద్ అంటే వ్యాఖ్యానం అని అర్థం. అంటే, యీగ్రంథంలో మతసూత్రాలూ, వాటివ్యాఖ్యానము కూడా ఇమిడి వున్నాయని భావం. అయితే, వాడుకలోమాత్రం, యీగ్రంథం అంతటినీ 'అవెస్తా' అని అంటారు.

ఈ గ్రంథంలోని చాలాభాగాలకు అర్థం చెప్పడం యీనాడు సాధ్యం కావడంలేదు. దానికికారణం, ఆభాగాలు రచింపబడిన భాష యీనాడు వాడుకలో లేకపోవడం: కొన్నిపదాలకు ఆనాడు వాడుకలోవున్న అర్థం మారిపోయి, యీనాడు కొత్త అర్థం వాడుకలోకి రావడం.

నేడులభించే అవెస్తా నాలుగుభాగాలుగా విభజింపబడివుంది. ఆభాగాలకు పేర్లు వరుసగా ఇవి : వెండీదాడ్, వీస్పెరాద్., యస్న, యష్ట్.

ఈభాగాలలోని భాషనుబట్టి చూస్తే, వాటివరుస సరియైనక్రమంలో కనుపించదు. మొదటి అవెస్తా భస్మమైన తరువాత, గ్రంథాన్ని తిరిగి రచించడంలో పై ఏర్పాటు జరిగివుంటుంది. భాషనుబట్టిచూస్తే, అవెస్తాలోని నాలుగు భాగాలు మొట్టమొదట యీ క్రిందిక్రమంలో రచించబడినట్లు తోస్తుంది.

1. యస్న. 2. వీస్పెరాద్. 3. వెండీదాడ్. 4. యష్ట్.

యస్న అంటే యజ్ఞం అని అర్థం. దీనిలో 72 అధ్యాయాలు వున్నాయి. 'గాథ'లు కూడా దీనిలో ఒక భాగం. గాథలు సంపూర్ణంగా జరతుష్ట్రి రచనగా భావింపబడుతున్నవి. అవెస్తాగ్రంథ మంతటిలోకి అతిపవిత్రంగా గౌరవింపబడుతున్నవి. ఇవన్నీ జరతుష్ట్రి దేవుని సంబోధించి చేసిన ప్రార్థనలు.

వీస్పెరాద్ అంటే దైవస్తోత్రాలు. ఇవి పూజాకలాపాలలో ఉపయోగించడానికి, కేవలం పూజారులకు ఉపయోగపడేవి. ఏస్తోత్రం పఠించేటప్పుడు, ఏవిధమైన అర్చనలు చెయ్యాలో వివరాలు దీనిలో వుంటాయి.

వెండీదాడ్ అంటే అనుష్ఠానక్రమం. ఇదికూడా కేవలం పురోహితులకూ, పూజారులకూ ఉపయోగపడేదే. వ్రతకలాపం, భూతోచ్చాటన, ఉపవాసపద్ధతి, పాపప్రాయశ్చిత్తవిధానాలు మొదలైనవిషయాలు, యీభాగంలో వున్నాయి.

యష్ట్ అంటే స్తోత్రం అన్నమాట. ఈభాగమంతా, పూర్వకాలపు దేవుళ్ళనూ, పురాణవీరులనూ కీర్తించే గ్రంథం. ప్రతిమాసంలోనూ, రోజుకు ఒక అధిదేవతను నిర్ణయించి, ఆదేవతాసంకీర్తనం యీభాగంలో చేర్చారు.

అవెస్తాగ్రంథ మంతటిలోకీ అతిపవిత్రంగా భావింపబడుతున్న 'గాథ'లు, జరతుష్ట్రి రచించిన ముఖ్యగ్రంథం. ఇవన్నీకూడా 'అహురమజ్ద'ను సంబోధించి జరతుష్ట్రి తన

ప్రార్థనలను, తనసందేహాలను, తనవిశ్వాసాలను చెప్పుకున్న గీతాలు.

ఈ గీతాలను కంఠస్థం చేసుకొని వల్లించడమే తప్ప, యీనాటి పార్శీమతస్తులలో చాలామందికి వీటి అర్థాలు తెలియవట.

పార్శీమతస్తులు తమమతంలోనికి ఇతరులను చేర్చుకొనరు. అయితే, జరతుష్ట్ర బోధించిన విషయాలలో మానవుడు తననిత్యజీవితంలో అనుసరించదగిన నియమాలను, ఆ మతస్థులు కానివారుకూడా గౌరవించి అనుసరించ వచ్చును.

అవేమిటంటే :

మనో, వాక్, కర్మ శుద్ధి

పరిశుభ్రత

దాక్షిణ్యము

ఉపయోగకరమైన పశువులపట్ల దయ

ప్రయోజనకరమైన పనులనుచెయ్యడం

విద్యార్జనకు ఆర్థికంగా శక్తిలేనివారికి సహాయం చెయ్యడం.

ఈ నియమాలు ఎల్లరూ పాటించదగినవే కదా!

# క్రైస్తవ మతము

ఈనాడు ప్రపంచప్రజనాభాలో మూడవవంతుమంది, అంటే దాదాపు 80 కోట్ల ప్రజలు, క్రైస్తవ మతావలంబులు.

జీసస్ అనే ఒకమహాపురుషుని ఆత్మార్పణతో ఈ గొప్పమతం ఆరంభమైంది. ఆమహనీయునిబోధ, ప్రపంచంలో ప్రేమామృతాన్ని చిలికింది. ఈమత ప్రచారానికి ఎంతోమంది పుణ్యపురుషులు తమప్రాణాల్ని అర్పించారు. ఈమతంపేర ఎన్నోయుద్ధాలు జరిగాయి. ఈమతబోధకులు, తమ మతప్రచారంతోపాటు మానవసేవచేసి ధన్యజీవులయారు. ఈమతబోధకులే లేకపోతే, ప్రపంచంలోవున్న ఎన్నోవిద్యాలయాలు, ఎన్నోవైద్యాలయాలు నేడు వుండేవి కావు.

జుడియా దేశంలో (యూదు జాతిలో) పుట్టిన జీసస్, జుడియాలోని తన యూదు మతగురువులూ, జెరుసలేంపట్టణంలోని దేవాలయార్చకులూ సాగించే అత్యాచారాలను పొగొట్టి, నీతినియమాలను నెలకొల్పాలని బోధలను చేశాడు. యూదులు ఆయనబోధనలను నిరసించి, ఆయనను శిలువవేయించారు. కాని, నేటిప్రపంచంలో మూడవవంతు జనాభా ఆ మహనీయుని బోధనలను శిరసావహించింది.

జీసస్‌బోధనలను అంగీకరించి, ఆయనమతాన్ని అవలంబించిన వారిలో ప్రథములు గ్రీకుదేశీయులు. వారు జీసస్‌కు క్రిస్టోస్ అనే గౌరవనామాన్ని అంకితం చేశారు. గ్రీకుభా

షలో క్రిస్టోస్ అంటే మూర్ధాభిషిక్తుడు అని అర్థం. ప్రజలకు ప్రభువుగా భగవంతునిచే పట్టాభిషేకం చేయబడినవాడని భావం. క్రిస్టోస్ అనే గ్రీకుపదం, ఇంగ్లీషులో క్రైస్ట్ అయింది. నేడు జీసస్‌ను జీసస్ క్రైస్టు అనీ, క్రైస్టు అనీ అంటున్నారు. తెలుగులో 'ఏసుక్రీస్తు' అని వాడుక.

తనజాతి మతగురువులు హృదయంలేని నియమాలను బోధిస్తే, ఏసుక్రీస్తు సర్వమానవులనూ ఒకే కుటుంబంగా చేసే పవిత్రప్రేమను బోధించాడు.

తనను శిలువవేసి, తను బాధపడుతూవుంటే అపహాసించినవారిని చూసి "తండ్రీ, వారినిక్షమించు వారేమి చేస్తున్నారో వారికే తెలియదు;" అని భగవంతుని అర్థించిన ఏసుక్రీస్తు ఒక మహోత్తరమైన ప్రేమమూర్తి కాదా!

## క్రీస్తు జననం

ఏసుక్రీస్తుజీవితాన్ని గురించి పూర్తివివరాలు యీనాడు మనకు తెలియవు. తెలిసినంతవరకు, వృత్తాంతం ఇది.

ఆయనతల్లి మేరి; తండ్రి జోసెఫ్. తండ్రివృత్తి, వడ్రంగము. క్రీస్తు దేవాంశభూతుడని చెప్పడానికి ఒకకథవుంది. కన్యగావుండగానే దైవాంశవల్ల మేరి గర్భిణి అయిందట. గర్భవతి అయినకన్యను ఇరుగుపొరుగువారు నిందించగా, ఆమె అగౌరవాన్ని పోగొట్టడానికి జోసెఫ్ ఆమెను వివాహం చేసుకున్నాడట. ఈ దంపతులకు, జీసస్ తరువాత చాలామందిబిడ్డలు పుట్టారు. వారిలో మగవారిపేర్లు: జేమ్స్, జోసెఫ్, సైమన్, జుడాస్.

క్రీస్తుజననం, క్రీస్తుశక ప్రారంభానికి నాల్గుసంవత్సరాల క్రితం. ఆరోజులలో జుడియారాజ్యం, రోమ్ చక్రవర్తి ఆగస్టస్ సీజర్ పరిపాలనలోవుంది. కాని, ఆగస్టస్‌కులోబడి హీరాడ్ అనే రాజు జుడియాను పాలించేవాడు. చక్రవర్తికి ఎదురు తిరగకుండా హీరాడ్‌ను అదుపులో వుంచడానికి, కొంత రోమన్ సైన్యంతో ఒక రోమన్ అధికారి చక్రవర్తిప్రతినిధిగా జుడియాలో వుండేవాడు. ఈ అధికారిని ప్రొక్యూరేటర్ అనేవారు.

హీరాడ్ చాలా చెడ్డవాడు. అతని క్రూరపరిపాలనకు ప్రజలు చాలా కష్టపడేవారు. తమబాధలనుంచి తమకు విముక్తి ఎప్పుడుకలుగుతుందా అని ఆక్రోశించేవారు. అలాటి సమయంలో వారికి, తమ పూర్వీకులు చెప్పిన జోస్యం ఒకటి జ్ఞప్తికివచ్చేది. తమబాధలను తొలగించి, న్యాయాన్నీ, శాంతినీ స్థాపించడానికి దేవాంశసంభూతుడు త్వరలోనే ఉద్భవిస్తాడనీ, అతడే యూదులకు రాజు అవుతాడనీ.

ప్రజలు యీవిధంగా నమ్ముతున్నారని హీరాడ్‌కు తెలుస్తుంది. అతడు భయపడతాడు. ఇలా ఉంటూవుండగా పెర్షియానుంచి ముగ్గురు జ్ఞానులు జెరుసలేం వస్తారు. వారి రాకకు కారణం ఏమిటని హీరాడ్ వారిని ప్రశ్నిస్తాడు.

"త్వరలోనే డేవిడ్ వంశంలో దేవాంశసంభూతుడు పుట్టబోతున్నాడు. తూర్పుదిక్కున ఆకాశంలో ఒక కాంతివంతమైన చుక్క పుట్టింది. ఆచుక్క ఎటుపోతున్నదో దానిని అనుసరించి మేము వస్తున్నాము. ఆచుక్క ఎక్కడ ఆగుతుందో అక్కడ దేవాంశసంభూతుడు పుట్టబోతున్నాడు.

అతనిని అర్చించడానికే మేము వచ్చాము'', అని ఆజ్ఞానులు హీరాడ్‌కు చెపుతారు.

''మీరు చూసిన తరువాత, ఆ దేవాంశసంభూతుడు ఎవరో, ఎవరి బిడ్డడో, ఎక్కడఉంటాడో మాకుకూడా చెప్పండి'' అని హీరాడ్, ఆజ్ఞానులను అడుగుతాడు. ''సరే'' నని వారు వెళ్లిపోతారు.

మేరి, జోసఫ్‌ల కాపురం, నాజరెత్ అనే గ్రామంలో. కాని, జోసెఫ్ పూర్వీకులు బెత్లెహెం గ్రామానికి చెందినవారు. ఆసంవత్సరంలో రోముచక్రవర్తి ఒకఆజ్ఞను చేశాడు. తన రాజ్యంలోని ప్రజలందరూ, తమపూర్వికుల జన్మస్థానాలకు వెళ్లి, అక్కడ చక్రవర్తిఉద్యోగులకు తమ పేర్లను చెప్పుకొని, తాము చెల్లించవలసిన పన్నులను చెల్లించవలసిందని. అందువల్ల జోసెఫ్, తనభార్యమేరిని వెంటబెట్టుకొని నాజరెత్ నుంచి బెత్లెహెంకు ప్రయాణం చేశాడు. అప్పుడు మేరి గర్భవతి. వారిరువురు బెత్లెహెం చేరేటప్పటికి, వారిలాగే అనేకమంది తమ పేర్లను చక్రవర్తిఉద్యోగులకు చెప్పుకొని తమ పన్నులను చెల్లించడానికి అక్కడికి చేరుకుంటారు. అందువల్ల బసచెయ్యడానికి మేరి, జోసెఫ్‌లకు ఎక్కడా చోటు దొరకదు. దయాహృదయులైన ఒకకుటుంబం, ఆదంపతులనుచూసి జాలిపడి, తమగుర్రపుసాలలో వారికి చోటిస్తారు. ఆగుర్రపుసాలలో, గడ్డిని మెత్తగాపరచి మేరిని పడుకోమంటాడు, జోసెఫ్.

మేరి, నిండుగర్భిణి. చాలాదూరం ప్రయాణంచేసి, అలసిపోయింది. ఆగుర్రపుసాలలో, ఆగడ్డిమీద ప్రసవిస్తుంది.

జీసస్ జన్మించాడు. ఆదేసమయానికి, పెర్షియా దేశపు ముగ్గురుజ్ఞానులు, ఆకాశంమీద చుక్కపోయిన దారినే వస్తారు. జీసస్‌జన్మించిన గుర్రపుసాలమీదకువచ్చి, ఆచుక్క మాయమవుతుంది. జ్ఞానులకు అంతాఅర్థమవుతుంది. వారు ఆగుర్రపుసాలలోకి వెళ్లి జీసస్‌నుఅర్చించి, కానుకలను సమర్పించి, తమదారిన తాము వెళ్ళిపోతారు.

జ్ఞానులువచ్చి దేవాంశసంభూతుడు ఎక్కడ పుట్టినదీ తనకు చెపుతారని ఎదురుచూస్తూవున్న హీరాడ్, ఎంతకాలానికీ వారురాకపోయేసరికి వారిసంగతి ఏమైనదీ తెలుసుకు రమ్మని తనచారులను పంపిస్తాడు.

బెత్లెహేంలో ఒకబాలుడు జన్మించాడనీ, అతనిని దర్శించి ఆజ్ఞానులు తమదేశానికి వెళ్ళిపోయారనీ చారులు వచ్చి హీరాడ్‌కు చెపుతారు. తనను పదభ్రష్టుని చేసి, యూదులకు రాజుఅయే ఆబాలుడు ఎవరో తెలియకపోయెనే అని హీరాడ్ క్రోధావేశంతో, మూడుసంవత్సరాలలోపున బెత్లెహేంలోపుట్టిన మగబిడ్డలనందరినీ నరికివెయ్యమనితన భటులకు ఆజ్ఞయిస్తాడు. హీరాడ్ ఇలాటి ఆజ్ఞయిచ్చాడన్న వార్త బెత్లెహేంలో కొంతమందికి, రాజభటులురాకముందే తెలుస్తుంది. వారంతా తమబిడ్డలను తీసుకొని, హీరాడ్ రాజ్యపు యెల్లలనుదాటి పొరుగుదేశాలకు పారిపోతారు.

మేరి, జోసఫ్‌లుకూడా జీసస్‌నుతీసుకొని ఈజిప్టు వెళ్ళిపోతారు.

తరువాత కొద్దికాలానికే హీరాడ్ చచ్చిపోతాడు. అతడి చావుతో చిన్నబిడ్డల్ని నరకడం ఆగిపోతుంది.

హీరాడ్ చావుకబురు తెలిసినతరువాత, మేరి జోసెఫ్‌లు జీసస్‌ను వెంటబెట్టుకొని నాజరెత్‌కు తిరిగివస్తారు. అక్కడ జోసెఫ్ తనవడ్రంగపువృత్తిని తిరిగి ఆరంభిస్తాడు. కష్టపడిపనిచేసుకొని అటునిరుపేదకాకుండా, ఇటుభాగ్యవంతుడుకాకుండా, మధ్యరకంగా జోసెఫ్ తనసంసారాన్ని గడుపుతూవుంటాడు.

జీసస్ తరువాత, ఆదంపతులకు చాలామంది బిడ్డలు పుడతారు. పెరుగుతూవున్నబిడ్డలకు జోసెఫ్ తానే చదువు చెపుతాడు. జీసస్ తండ్రివద్ద వడ్రంగపుపని నేర్చుకుంటాడు.

ఇలా రోజులుగడుస్తూవుంటే, జుడియాలో పరిస్థితులు మారినవి. హీరాడ్ మరణానంతరం అతనిరాజ్యాన్ని అతని వారసులు ముగ్గురిమధ్య పంచడం జరుగుతుంది. జుడియా ప్రాంతం, హీరాడ్ అనేపేరుగల మరొకనికి చెందుతుంది. రోమ్‌చక్రవర్తి ఆగస్టస్ చనిపోయి, టైబీరియస్ చక్రవర్తి అవుతాడు. చక్రవర్తి ప్రతినిధిగా పోంటియస్ పైలేట్, జుడియాలో ప్రొక్యురేటర్‌గా నియమింపబడుతాడు.

జీసస్ తన పన్నెండవయేట ఒకసారి తల్లిదండ్రులతో జెరుసలేం వెళ్ళివస్తాడు. అక్కడి జెహోవా దేవాలయంలోని పరిస్థితులు, అంతచిన్నతనంలోనే అతనికి జుగుప్స కలిగిస్తవి. ఇంటికి తిరిగివచ్చి, వడ్రంగపుపని చేసుకొంటూనే, మతవిషయాలనుగురించీ, దేవాలయపరిస్థితులనుగురించీ ఆలోచిస్తూవుంటాడు. జీసస్‌తండ్రి జోసెఫ్ చనిపోతాడు. కుటుంబాన్ని పోషించేభారం జీసస్‌మీాద పడుతుంది. ఇలా కాలం జరుగుతూవుంటే జీసస్‌కు ఇరవైసంవత్సరాలు దాటుతవి.

## జాన్ ప్రబోధం

ఈలోగా జుడియాలో ఒకగొప్పసంచలనం బయలు దేరుతుంది. దీనికి కారకుడు జాన్. ఇతడు జీసస్ తల్లి మేరికి, వేలువిడిచిన పినతల్లికొడుకు. జీసస్‌కన్న ఒకయేడు పెద్ద. ఇతడు సర్వసంగపరిత్యాగంచేసి, మతసంస్కరణకు పూను కుంటాడు. పెద్దలమతాన్ని సరిగా పాటించని ప్రజలను తీవ్రంగా విమర్శిస్తాడు. తమదుర్నడతలను విడనాడి, జెహోవాను సరిగా అర్చించి, పూర్వీకులు బోధించిన నియమాల ప్రకారం నడచుకోకపోతే, జెహోవా ఆగ్రహానికి పాత్రులై, నరకబాధలు అనుభవిస్తారని ప్రజలకు బోధ చేస్తాడు. భయపడినవారందరూ అతనివద్దకువచ్చి తమపాపాలనుంచి తమను విముక్తుల్ని చెయ్యమని అతనిని అర్థిస్తారు. అతడు వారిచేత శుద్ధిస్నానాలు చేయించి, సన్మార్గంలో నడచుకోమని బోధ చేసి పంపుతాడు.

జాన్ సంగతి దేశమంతటా తెలుస్తుంది. జీసస్ కూడా వింటాడు. జాన్‌ను చూడడానికి నాజరెత్‌నుంచి బయలుదేరి డెడ్‌సీ ప్రాంతానికి వెడతాడు. జాన్, జీసస్‌లు కలుసుకుంటారు. జాన్ బోధనలను జీసస్ వింటాడు. జీసస్ హృదయం కదులుతుంది. మనసులోని ఆరాటం హెచ్చుతుంది. మనస్సుకు శాంతిని కలిగించే మార్గాన్ని కనుక్కోడానికి, ఏకాకిగా జీసస్ అనేకప్రాంతాలు తిరుగుతాడు. అలాతిరగడంలో కొన్నిసంవత్సరాలు గడుస్తవి. ఆకాలంలో జీసస్ భారతదేశంలోని సింధునదీతీరప్రాంతాలకు, కాశ్మీర్ దేశానికికూడా వచ్చివుంటాడని కొందరి నమ్మకం. ఏమైనా

ఆరోజులలో బౌద్ధమతం ఆఫ్ఘనిస్థాన్ వరకు ప్రబలంగా వ్యాపించింది. సింధునదీతీరంవరకు, యూదులు బాగా వ్యాపారం సాగించేవారు. అంచేత భారతదేశంలో మహోజ్జ్వలస్థితిలో వున్న బౌద్ధమతాన్నిగురించీ, బుద్ధదేవుడు బోధించిన కరుణామతాన్నిగురించీ జీసస్ వినివుండవచ్చు. అలా జరిగి వుంటుందని వాదించేవారు కొందరున్నారు; కాదనేవారూ కొందరున్నారు. జీసస్ తనమార్గాన్ని నిర్ణయించుకొని, తన బోధలకు రూపుకల్గించుకొని తిరిగి తనయింటికి చేరుకున్నాడు.

సన్మార్గంలో నడవనివారిని జెహోవా నరకయాతనలను అనుభవింపజేస్తాడని జాన్ బోధించాడు.

దేవుడు ప్రజలకు తండ్రి. ప్రేమమూర్తి. తప్పుచేసినవాడు పశ్చాత్తాపంచెంది, మంచినడతలోకి వచ్చినట్లయితే దేవుడు అమితదయతో క్షమిస్తాడు. ప్రజలు అన్యోన్యప్రేమతో మెలగాలి అని జీసస్ బోధించాడు,

ఆరోజులలో ఎవరియిష్టంవచ్చినట్టు వారు మతబోధనలను చేసుకోవచ్చు. మతబోధనలవిషయంలో రోమను అధికారులు జోక్యం కలిగించుకొనేవారుకారు. తమచక్రవర్తినీ, తమపరిపాలననూ ఎవరూ విమర్శించకుండా జాగ్రత్త పడేవారు.

జాన్ తనవిమర్శనలను ప్రజల ప్రవర్తనమీద నేకాక, రాజు హీరాడ్ ప్రవర్తనమీద కూడా చెయ్యసాగాడు. హీరాడ్ తనభార్యకు విడాకులిచ్చి, తన సోదరునిభార్య హీరొడియాస్‌ను పెండ్లాడుతాడు. వీరిప్రవర్తనను జాన్ తీవ్రంగా విమర్శిస్తాడు. హీరొడియాస్, తనకూతురు సెలోమి

చేత, జాన్ గొంతుక కోయించి అతని శిరస్సును తనక యిప్పించమని హీరాడ్‌ను అడిగిస్తుంది. హీరాడ్ తనభటుల చేత అంతపనీ చేయిస్తాడు.

జాన్ మరణవార్త జీసస్‌ను మరీ కదలిస్తుంది అప్పుడు జీసస్‌కు ముప్పదియేండ్లు. ఇక తనప్రజలకు తాన తీవ్రంగా బోధచేసి వారిని సన్మార్గంలోకి త్రిప్పాలని నిశ్చయం చేసుకొని, ఇల్లువిడచి, తల్లినివిడచి ధర్మబోధకు బయలు దేరుతాడు.

జీసస్ బోధించిన ధర్మాలు ముఖ్యంగా ఇవి :

దేవుడు ఒక్కడే.

ప్రతి వ్యక్తీ తనను తాను ఎంతప్రేమించుకుంటాడో, యితరులనుకూడా అలాగే ప్రేమించాలి.

హింసను ప్రతిఘటించవద్దనీ, ప్రతీకారం తలపెట్టవద్దనీ ఆయన బోధించాడు. 'నీకుడిచెంపమీద ఎవడైనా కొడితే, రెండవచెంపకూడా వానికి చూపించు,' అని సహనధర్మాన్ని బోధించాడు. రేపటికోసం భాగ్యం కూడబెట్టి, నేడు నీ పొరుగువాడు బాధపడుతూవుంటే చూస్తూ వూరుకోకు, అని సమతను బోధించాడు. ప్రాణహత్య చెయ్యవద్దన్నాడు.

జెరుసలేంలోని జెహోవా దేవాలయంలోపల, రూకల మారకం, గొర్రెల అమ్మకం చేస్తున్నవారిని యీసడించి, వారందరినీ బైటికితోలి, "దేవాలయాన్ని అంగడిగా మార్చ వద్దు" అని మందలించాడు.

## మరణ దండన

జీసస్ బోధనలను, చర్యలను చూసి యూదు మత

గురువులు ఆగ్రహావేశులయారు. జీసస్ అనుచరులలో ఒకడైన జుడాస్‌కు లంచంపెట్టి, జీసస్ బసచేసిన చోటును తెలుసుకొని, జీసస్‌ను బందీగా పట్టుకొనిపోయారు.

విప్లవాన్ని బోధిస్తున్నాడనే నేరం మోపి జీసస్‌ను హీరాడ్ ఎదుట పెట్టారు. హీరాడ్ జీసస్‌ను పోంటియస్ పైలేట్ వద్దకు పంపాడు. జీసస్‌కు శిక్షవిధించడానికి మొదట నిరాకరించినా, చివరకు పోంటియస్ పైలేట్ యూదుమత గురువుల ఒత్తిడిభరించలేక జీసస్‌కు మరణదండన విధించాడు.

జీసస్‌ను శిలువమీద మేకులతో కొట్టి, గోల్గోతా కొండమీద ఆశిలువను పాతుతారు. ప్రేమను ఒకధర్మంగా బోధించిన ఆమహాత్ముని జీవితం, అతడి ముప్పదిమూడవపేట యీవిధంగా అంతమవుతుంది.

శిలువమీద జీసస్ మరణించినతరువాత, అతని శవాన్ని పూడ్చిపెడతారు. కాని, మూడవనాడు జీసస్ శరీరం ఆ శవపేటికలో కనుపడదు. ఏమయిందో ఎవరికీ తెలియదు.

జీసస్ మరణానంతరం, అతనిబోధనలను అతని శిష్యులు ప్రచారం చెయ్యసాగారు.

జీసస్ జీవితకాలంలోనే అతడు అనేక మహిమలను చూపినట్లు వార్తలు విస్తారంగా వ్యాపించాయి. జీసస్ మరణానంతరం, అతనిమహిమలనుగురించి ఎన్నో కథలు ప్రచారంలోకి వచ్చాయి. లోకోత్తరవ్యక్తు లందరినిగురించీ, యిలాటికథలు ఎన్నోవాడుకలోకి వస్తాయి. దేవునికుమారుడుగా, దేవునిప్రేమను ప్రజలకుబోధించి, ప్రేమను ధర్మంగా

బోధించిన నేరానికి ప్రాణాలనే అర్పించిన మహనీయుని మహిమలనుగురించి ఎన్నోకథలు వ్యాప్తిలోకివచ్చాయంటే అబ్బురంఏమీ లేదు.

జీసస్ పల్లెటూరివాడు. పల్లెటూరిప్రజలమధ్యనే అతనిజీవితం ఎక్కువగా గడిచింది. పల్లెటూరిప్రజల జీవితాలలోని ఆనందక్లేశాలను ఆయనబాగా పరిశీలించాడు. అందువల్లనే, జీసస్ బోధలన్నీ పల్లెటూరిప్రజలభాషలో, క్లుప్తంగా వుండేవి. ధర్మాలను బోధించేటప్పుడు నాగరికభాషలోని భేషజాల అర్థం తెలియని సామాన్యులకు అర్థమయేటట్టు, ఆయన చిన్న ఉపమానాలతో మంచిచెడ్డలను పోల్చేవాడు; కట్టుకథలతో నీతిని బోధించేవాడు.

## సెర్మన్ ఆన్ ది మౌంట్

కేపర్నాంకొండలలో ఒకకొండమీద జీసస్ చేసిన బోధ చాలాప్రసిద్ధమైనది. దానిని "సెర్మన్ ఆన్ ది మౌంట్" అంటారు. దానిసారాంశం ఇది. "క్లేశపడినవారే ఆనందాన్ని అనుభవిస్తారు. దయగలవారే క్షమను పొందగలరు. శాంతిస్థాపకులే దేవునిబిడ్డలు. అణకువగలవారే, భూలోకరాజ్యాన్ని అనుభవించగలరు.

"నారుపోసినవాడు నీరుపోసినట్లు, మనుష్యుల మనుగడకు దేవుడే దారిచూపుతాడు. రేపటికొరకు తాపత్రయపడి ధనధాన్యాలను దాచుకోనవద్దు. దాచిపెట్టిన ధనం దొంగలపాలే."

జీసస్ బోధలనుచేస్తూవుంటే, ఆయనమాటలకు ముగ్ధులై అమాయకులైన చిన్నపిల్లలుఆయననుచేరి, ఆయన

తొడమీద కూచునేవారు. ఒకసారి ఇలాటిపిల్లలను వెళ్ల గొట్టడానికి ఎవరో ప్రయత్నిస్తే, వారిని జీసస్ మందలించాడు. "పిల్లలను వెళ్లగొట్టవద్దు. నాదగ్గరకు రానివ్వండి. దేవునిరాజ్యంలో వుండేవారు అలాటివారే" అన్నాడు.

ఆయనసంభాషణలు చక్కనిసామెతలతో, సున్నితమైనఛలోక్తులతో కూడివుండేవి.

జీసస్ జాతిభేదాలను పాటించలేదు. యూదులచే అస్పృశ్యులుగా, అవాచ్యులుగా పరిగణింపబడే సమరిటనులతో ఆయన కలసిమెలసి తిరిగాడు. యూదులు తమ దేవాలయ సమీపానికికూడా రానివ్వని ఒకరోమన్ అధికారి యింటిలో ఆయన భోజనంచేశాడు. శరీరాన్ని కార్శ్యపెట్టి సర్వసంగపరిత్యాగంచేసి, తపస్సులుచెయ్యమని ఆయన బోధించలేదు. జీవితం ఆనందమయం చేసుకోమన్నాడు. క్రౌర్యాన్నివిసర్జించి, హృదయాన్ని ప్రేమతో నింపుకొంటే దేవునిస్వర్గం భూలోకంలోనే వుంటుందన్నాడు. లోకంలో దుష్టత్వం నశించడానికి ఒకేమందు వుందన్నాడు; అదేప్రేమ అని నిర్వచించాడు.

బహిరంగంగా వ్యభిచారవృత్తితో జీవించే స్త్రీని ఆ రోజులలో, నడిబజారులో నిలబెట్టి, ప్రజలు గుంపులుగా ఆమెచుట్టూచేరి ఆమెమీద రాళ్లురువ్వి, చంపేవారు. మగ్దలాలో ఇలాటి ఒకస్త్రీని, ప్రజలు జీసస్ఎదుట పెట్టారు. ఆమెదోషి అని జీసస్అనగానే ఆమెమీద రాళ్లురువ్వడానికి చుట్టూచేరినగుంపు సిద్ధంగా వున్నారు. కాని, ఆప్రేమమూర్తి ఆమాట అనలేదు. చుట్టూచేరిన గుంపునుచూసి,

'పాపంచెయ్యని మనిషి మీలో ఎవరైనా వుంటే, అతడు మొట్టమొదటి రాయిని యీమెమీదకు విసరవచ్చును' అన్నాడు. గుంపులోని ప్రజలు నిర్ఘాతంపోయారు; సంకోచించారు. చల్లగా, ఒక్కొక్కరే తమదారిన తాము పోయారు.

"పాపమన్నమాట తెలియని పదిమందికంటె, పాపం చేసి పశ్చాత్తాపంచెందిన ఒక్కవ్యక్తి దేవునికి ఎక్కువ ఆనందాన్ని కలిగిస్తాడు," అన్నాడు జీసస్.

నిష్కల్మషమైన, ప్రయోజనాపేక్షలేని ప్రేమ అనశ్వరం. అలాటి ప్రేమను బోధించేమతం, హృదయంగల ఒక్కమానవుడు యీలోకంలోవున్నా, అతనిలో నిలుస్తుంది. అందువల్లనే క్రైస్తవమతం నిలిచింది.

జీసస్ యూదుజాతిలో పుట్టాడు. అతని మొదటి శిష్యులు యూదులు. అతనిని చంపినవారుకూడా యూదులే. ప్రపంచాన్ని అంతటినీ ప్రేమతో హృదయానికి హత్తుకోలేని సంకుచితబుద్ధివల్ల, యూదుమతగురువులు తమజాతిలోపుట్టిన ఒకమహాత్ముని పోగొట్టుకున్నారు. ఏమతాన్ని అవలంబించే వారైనా శిరసావహించే జీసస్ ప్రేమబోధలు, నేడు ప్రపంచంలో ఒకగొప్పమతంగా స్థిరపడినవి. ఆబోధలను అక్షరాలా పాటించేవారు క్రైస్తవులలో యీనాడు ఎక్కువగా లేక పోవచ్చు. కాని ప్రపంచంలోని ప్రతిమతంలోనూ ఇలాటి వారు వున్నారు. ఒకమతం గొప్పతనం, దానిబోధలలోవుంది. కాని, దానిని అక్షరాలాపాటించేవారి సంఖ్యలో లేదు.

## పాల్

క్రైస్తవమతబోధలకు ఒకరూపాన్ని కల్పించి, దాని ప్రచారానికి విశేషంగా తోడ్పడినవాడు, పాల్.

ఆసియామైనర్ పశ్చిమోత్తర భాగంలోవున్న టార్సస్ అనేపట్టణంలో, ఒకయూదుకుటుంబంలో పాల్ జన్మించాడు. అతనికి తల్లిదండ్రులు పెట్టిన పేరు సాల్. గ్రీకు ఉచ్చారణలో ఆపేరు పాల్ అయింది. పాల్ తండ్రి భాగ్యవంతుడైన ఒకవ్యాపారి. అందువల్ల పాల్‌ను విద్యకోసం జెరుసలేం పంపించాడు. చదువుపూర్తిచేసుకొని, పాల్ తన జన్మస్థలానికివచ్చి, ధర్మశాస్త్రాన్ని బోధిస్తూ, తనతండ్రితో కలసి వ్యాపారంచేస్తూ కాలం గడిపేవాడు.

పాల్ వయస్సు, దాదాపు జీసస్ వయసుతో సమానం. టార్సస్‌లోవున్న పాల్‌కు, జీసస్‌ను శిలువవేసి చంపినవార్త తెలిసింది. యూదుధర్మానికి విరుద్ధంగా బోధలనుచేసిన ఎవరినో శిలువవేసివుంటారు అనుకుని వూరుకున్నాడు.

ఇంతలో జెరుసలేంలోని మతగురువుల వద్దనుంచి పాల్‌కు పిలుపువచ్చింది. యూదుధర్మానికి విరుద్ధంగా ప్రచారంచేస్తున్న క్రైస్తవులనేవారిని అణగద్రొక్కడానికి సహాయంచేయమని.

వెంటనే పాల్ జెరుసలేం వెడతాడు. జెరుసలేంలోని క్రైస్తవులను అతడు హింసిస్తాడు. డమస్కస్‌లో క్రైస్తవుల సంఖ్య నానాటికీ పెరుగుతున్నదని వార్తవస్తుంది. పాల్ డమస్కస్‌కు ప్రయాణం అవుతాడు. దారిలో పాల్ మనస్సులో ఒకగొప్ప మార్పువస్తుంది. డమస్కస్‌లోని క్రైస్త

వులను హింసించడానికి బదులు, వారితో కలసి క్రైస్తవమత ప్రచారానికి పూనుకుంటాడు.

అప్పటినుంచి ఇరవై అయిదుసంవత్సరాలు పాల్ క్రైస్తవ మతబోధలో తనజీవితాన్ని గడుపుతాడు. సిరియా, మేసిడోనియా, క్రీట్, సిసిలీ దేశాలలో సంచారంచేసి, చివరకు రోంపట్టణం చేరుకుంటాడు.

రోంపట్టణంలో ఆయనబోధనలు రాజరికం వారికి ఆగ్రహం కలిగించినవి. రాజద్రోహనేరం మోపి, పాల్‌కు మరణదండన విధిస్తారు. కాని, పాల్ కృతకృత్యుడయాడు. ఆయనమరణించేనాటికి క్రైస్తవమతం బలపడింది.

పాల్ మరణించిన నూరుసంవత్సరాలనాటికి, పాల్ చేసిన బోధనలు, ఆయనవ్రాతలు, ఇతరక్రైస్తవబోధకులు వ్రాసినవ్రాతలు, ఒకగ్రంథంగా తయారైనవి. ఈగ్రంథమంతాకూడా మొట్టమొదట గ్రీకుభాషలో వ్రాయబడినది. దీనికి 'న్యూటెస్టమెంట్' అని పేరు. జీసస్‌కు పూర్వం యూదుజాతివారి మతగ్రంథానికి 'ఓల్డ్ టెస్టమెంట్' అని పేరు. ఇది ఆరమేయిక్ భాషలో వ్రాయబడినది. ఈ రెండింటినీ కలిపి, 'బైబిల్' అనేపేరుతో క్రైస్తవులు తమమతగ్రంథంగా చేసుకున్నారు. 'బైబిల్' అంటే గ్రంథం అనిఅర్థం. గ్రీకు భాషలోనుంచి బైబిల్ లాటిన్ భాషలోకి అనువదించబడింది. లాటిన్ నుంచి ఇంగ్లీషులోకి, ఇతర యూరపియను భాషలలోకి అనువదించబడింది.

క్రైస్తవమతబోధనలను అరికట్టడానికి రోముచక్రవర్తులు చాలాప్రయత్నాలు చేశారు. మతబోధకులను

చాలా హింసించారు. కొరత వేయించారు; ప్రాణాలతో తగలబెట్టించారు. ఏమిచేసినా, రోజురోజుకీ, యీమతాన్ని అవలంబించేవారి సంఖ్య ఎక్కువఅవుతూ వచ్చింది.

క్రీ. శ. 312 సంవత్సరంలో, రోం చక్రవర్తి కాన్‌స్టెన్‌టైన్ క్రైస్తవమతాన్ని స్వీకరించాడు. అప్పటినుంచీ క్రైస్తవమతావలంబులు కానివారిని హింసించి, బలవంతాన వారిని యీమతంలో చేర్చడంకూడా జరిగింది.

తరువాత క్రమంగా, యూరప్‌లోని అన్ని దేశాలూ క్రైస్తవమతాన్ని స్వీకరించాయి.

కాని, ఈనాడు హిందూమతంలో ఎన్ని తెగలు వున్నాయో క్రైస్తవమతంలోకూడా దాదాపు అన్ని తెగలు ఏర్పడినవి. క్రీస్తును దేవునిగా ఆరాధించి పూజించేవారు కొందరు; క్రీస్తు మానవమాత్రుడే కాని, ఒకమహావ్యక్తి అనేవారు కొందరు; రోంలోని పోప్, క్రీస్తుమతానికి ప్రధానాచార్యుడు అనేవారు కొందరు; పోప్ అధికారాన్ని అంగీకరించనివారు కొందరు. ఇంకా ఎన్నో మార్పులు పెట్టుకొన్నవారు ఎందరో.

అయితే, క్రీస్తు బోధించిన ప్రధాన ధర్మాలుమాత్రం అందరికీ ఆరాధనీయాలే.

# బౌద్ధ మతం

పూర్ణిమనాడు జననం; పూర్ణిమనాడు నిర్వాణం; పూర్ణిమనాడు మహాపరినిర్వాణం.

దుఃఖభాజనమైన మానవ జీవితానికి, నిర్వాణ మార్గాన్ని, అజ్ఞానాంధకారంనుంచి విముక్తి పొందడానికి జ్ఞానప్రకాశాన్ని చూపిన బుద్ధదేవుడు చల్లని; తెల్లని కాంతులుగల పూర్ణిమనాడు జన్మించడం, పూర్ణిమనాడే జ్ఞానోదయాన్ని పొందడం, తన మెనభయ్యవయేట, జన్మ దినంనాడు, మళ్లీ పూర్ణిమనాడే నిర్యాణం చెందడం,— దీనిలో ఎంత నిగూఢభావం వుంది!

బుద్ధదేవునిబోధలకు పూర్వం, భారతదేశంలో, అనేక మతాలు వున్నా అవన్నీ హిందూమతంలో శాఖలుగా వుండేవి. బుద్ధుని బోధలు విని అసంఖ్యాక ప్రజలు ఆయన మతాన్ని స్వీకరించడంతో, హిందూమతంకాక ప్రత్యేకంగా బౌద్ధమతం భారతదేశంలో వ్యాపించింది. భారతదేశంనుంచి ఆసియాఖండంలోని అన్నిదేశాలకూ వెళ్లింది. ఒకవెయ్యి సంవత్సరాలు భారతదేశంలో మహోజ్జ్వలస్థితిలో వెలిగి, హిందూమతంలో ఒకభాగమైపోయింది. కాని, ఆసియా ఖండంలోని తక్కినదేశాలలో మాత్రం ఒకప్రత్యేకమతంగా ఈనాటికీ నిలబడివుంది.

యజ్ఞయాగాదులపేరుతో మానవులు పశువులను చంపి తింటూవున్న రోజులలో, దేశంలో ఎక్కడా స్థిరమైన ప్రభుత్వంలేక రాజులు ఒకరితో ఒకరు యుద్ధాలుచేసి అసం

ఖ్యాక ప్రజల మారణానికి కారకులవుతున్న రోజులలో, సింధునదీతీరంవరకూ ఉత్తరభారతదేశాన్ని పెర్షియారాజులు ఆక్రమించుకున్న రోజులలో, భారతీయులు భూమిమీదా, సముద్రంమీదా ప్రయాణంచేసి, బేబిలోనియా, ఈజిప్టు, గ్రీసు దేశాలతో వ్యాపారం చేస్తున్న రోజులలో, బుద్ధుడు జన్మించాడు. ఆనాడు భారతీయులు మానసికంగా చాలా అస్థిమితమైన స్థితిలో వుండేవారు. ఒకప్రక్క వ్యాపారరీత్యా లక్షలు సంపాదించినవారూ, సైన్యాలను ప్రోగుచేసికొని బల హీనులను అణచి రాజ్యాలు సంపాదించుకున్నవారూ ఆనంద భోగాలను అనుభవిస్తూవుంటే, మరొకప్రక్క అనేకమంది ఈజీవితం ఏమిటి, ఎందుకు అనే ఆత్మచింతతో మధనపడే వారు. ఒకప్రక్క ఋషులు ఆధ్యాత్మికచింతలో వుంటే, మరొకప్రక్క పురోహితులు కర్మకాండను జరిపించేవారు. ఒకప్రక్క బలవంతులు రాజ్యాలు సంపాదించుకుంటూ వుంటే, మరొకప్రక్క బలహీనులు వైరాగ్యమే శరణ్యా మనుకొనేవారు. ఆకాలం అలాంటిది. అది రెండువేల అయిదువందల ఏండ్లనాటి కాలం.

## బుద్ధుని జననం

ఆకాలంలో హిమాలయపర్వతపాదాలవద్ద, గంగాతీర భూమిలో, లుంబినీవనంలో, ఒకసాలవృక్షంక్రింద, వైశాఖ పౌర్ణమినాడు, శాక్యవంశపురాజు శుద్ధోదనుని రాణి మాయాదేవి, లోకోత్తర పురుషుడు కావలసిన శిశువును కన్నది.

బిడ్డనుకన్న ఆనందాన్ని అనుభవించకుండానే, మగ

శిశువు పుట్టాడని గర్వించే అవకాశంలేకుండానే, ప్రసవ వేదనానంతరం విశ్రాంతిపొందే వ్యవధిలేకుండానే, మాయా దేవి యీమాయాప్రపంచాన్ని విడచిపెట్టింది.

పురిటికి పుట్టింటికివెడుతున్న మాయాదేవి మార్గ మధ్యంలోనే పుత్రునిప్రసవించి మరణించినందున, పరివార మంతా ప్రయాణం ముందుకుసాగించకుండా వెనక్కుమళ్లి, కపిలవస్తునగరంలో రాజ్యంచేస్తున్న శుద్ధోదనునికి అతని బిడ్డను అందజేశారు.

మాయాదేవి మరణానికి విచారసాగరంలో మునిగిన శుద్ధోదనునికి, పుత్రదర్శన మొక చంద్రోదయం. లేకలేక పుట్టిన బిడ్డనుచూసి, భార్యావియోగదుఃఖాన్ని దిగమ్రింగి, వేడుకజరుపుకోటానికి ప్రజలకు అనుమతినిచ్చాడు, రాజు.

తండ్రి ఆశిశువుకు సిద్ధార్థుడని పేరుపెట్టాడు. పుత్ర సంతానంకొరకు తపిస్తున్న తల్లిదండ్రులకు ఆశిశువు నిజంగా సిద్ధార్థుడే. శాక్యవంశరాజుల మూలపురుషుడు గౌతముడు. అందుచేత ఆశిశువుకు సిద్ధార్థగౌతమ అని పేరువచ్చింది.

గౌతముడు పెరుగుతున్నాడు. రాజవంశ ఆచార ప్రకారం విద్యలు నేర్చుకుంటున్నాడు. కాని, తండ్రిమాత్రం ప్రతిరోజూ ఒకయుగంగా కాలం గడుపుతున్నాడు. దానికి కారణం,ఆవేదనకలిగించే దృశ్యాలనుచూసివిచారగ్రస్తుడై, గౌతముడు సన్యసించి ఒకగొప్ప ఋషిఅవుతాడని ఒకజ్యోతి ష్కుడు చెప్పడం. అందుచేత ఆవేదనకలిగించే దృశ్యాలుఏమీ యువరాజుకంటపడనివ్వకూడదని రాజు ఆజ్ఞాపించాడు. మనో హరమైన పరిసరాలలో యువరాజు పెరిగాడు.

యు క్తవయస్సురాగానే గౌతమునికి వివాహం అయింది. యువరాణి యశోధర కాపురానికి వచ్చింది. దంపతులు ఆనందసాగరంలో హాయిగా జీవితాన్ని గడుపుతున్నారు. యశోధర కడుపుపండింది. రాహులుడు పుట్టాడు.

ఒడిదుడుకులు లేకుండా, ప్రశాంతంగా కాలం ఎవరికీ గడవదు కదా!

## నాలుగు దృశ్యాలు

భార్యతో ఆనందంగా కాలంగడుపుతున్నాడు కదా, తనకొడుకు ఇకయెక్కడికీ పోడు అని శుద్ధోదనుడు సంతోషించాడు. ఒకనాడు గౌతముడు వాహ్యాళికి బయలు దేరి, రాజమార్గంలో వెడుతున్నాడు. ఏసందులోనుంచో, హఠాత్తుగా ఒకవిచిత్రరూపం ఆయనకు ఎదురుగా రాజమార్గంలోకి వచ్చింది. మనుష్యుడిరూపంలో వున్నప్పటికీ, మనుష్యుడుగా కనపడని ఆరూప మేమిటని గౌతముడు తనపరిచారకుని ప్రశ్నించాడు.

"ప్రభూ! అతడొక ముసలివాడు" అని పరిచారకుడు జవాబు చెప్పాడు.

"ముసలివాడా! అంటే?"

"వయస్సు చాలా పెరిగింది. జవసత్వాలు ఉడిగిపోయాయి."

"చిర కాలంజీవించే వారందరిస్థితీ ఇం తేనా?"

"అవును."

"నడుమువంగిపోయి, దౌడలుచప్పిడిపడి; పండ్లూడిపోయి, కన్నులులోపలికిపోయి, అడుగులు తడబాట్లు

పడుతూ నిలువలేక, నడవలేక బాధపడేదశ, అందరూ అనుభవించవలసిందేనా?''

గౌతముని గుండెలో ముల్లుగ్రుచ్చుకున్న ట్లయింది. ఇకముందుకుపోలేక ఇంటికి తిరిగివెళ్ళాడు. ఆరాత్రి ఆయనకు నిద్రపట్టలేదు.

మరొకనాడు, ఒకకుష్ఠురోగి గౌతముని కంటబడ్డాడు. శరీరంఅంతా పుండ్లుపడి రసికారుతూ చాలాఅసహ్యస్థితిలో వున్న ఆమనిషి అలావుండడానికి కారణం ఏమిటి అని పరిచారకుని అడిగాడు.

''ప్రభూ! అదొకజబ్బు. మనిషైపుట్టినతరువాత ఏదో ఒకజబ్బురాకుండా ఎవరూ వుండరు,'' అని పరిచారకుని జవాబు.

ప్రతిమనిషీ ఏదోఒక వ్యాధితో ఎప్పుడోఒకప్పుడు బాధపడవలసిందేనా? మనిషికి వ్యాధి ఎందుకు రావాలి! వ్యాధి, ముసలితనాలు లేకుండా మానవులు జీవించలేరా? ఈబాధలను మానవులకు కలిగించేది ఎవరు?

కలకబారిన మనస్సుతో గౌతముడు ఇంటికి వెళ్లాడు.

ఇంకొకనాడు, సప్తకట్లసవారీమీద ఒకశవాన్ని నలుగురు మోసుకొని పోతూవుంటే, వెనకాల కొందరు ఏడుస్తూ వెళ్లడం గౌతముడు చూశాడు. ''ఏమిటది!'' అని అడిగాడు.

''ప్రభూ! అది ప్రాణంలేని శరీరం,'' అని చెప్పాడు పరిచారకుడు.

''అంటే?,'

"ప్రతిమనిషీ చావవలసిందే. చావు ఎందుకువస్తుందో ఎవరికీ తెలియదు. కాని పుట్టినమనిషి గిట్టకతప్పదు. శరీరం లోని ప్రాణి ఎక్కడికో పోతుంది. అతరువాత శరీరం నిష్ప్రయోజనం. అందువల్ల, ఆశరీరాన్ని తీసుకొనివెళ్లి తగల బెడతారు.

"ప్రతిమనిషీ చావవలసిందేనా?"

"ఆ. ప్రతిమనిషీ చావవలసిందే. వయస్సుముదర కుండా చస్తే, ముసలితనాన్ని తప్పించుకోవచ్చును; అదృష్టం వుంటే అనేకరోగాలను తప్పించుకోవచ్చును కాని, చావును తప్పించుకోగలవారు ఎవరూ లేరు. ఎంత మమకారంతో పెంచినా, ఎన్ని అనుభవాలనుపొందినా శరీరం బూడిద కావలసిందే. అంతఃపురంలోని మహారాజుగాని, నడివీధిలోని దరిద్రుడుగాని, అరణ్యంలోని తపసిగాని, అందరూ మట్టిలో కలవవలసిందే. లోకంఅంతటా ఓహో అనిపించుకున్న ప్రజ్ఞా శాలిగాని, ప్రజలందరిచేతా మన్ననలనుపొందిన సత్పురుషుడుగాని, ఇరుగుపొరుగువారిచేత ఇస్సీ అనిపించుకున్న మందమతివలెనే, ఎదుటబడినవారందరిచేతా కంటగించుకో బడిన దుష్టుడివలెనే, చావుకు తలనొగ్గవలసిందే. చావుకు ఎక్కువతక్కువలు లేవు; మంచిచెడ్డలు లేవు; తరతమ భేదాలు లేవు."

అంతా విన్నాడు గౌతముడు; నిర్విణ్ణుడై యింటికి చేరాడు. ఏమిటి యీజన్మ? ఎందుకు యీజన్మ! జీవితంలో కష్టాలు, విచారాలు ఎందుకు వుండాలి? వీటికి కారకులెవరు?

ఈ ఆలోచనలతో ఆయనమనస్సు ఆరాట పడి పోయింది.

మరొకనాడు కాషాయాంబరధారి అయిన ఒక సన్యాసి గౌతముని కంటపడ్డాడు. అతనిముఖంలో ఒక తేజస్సు వున్నది; ఆనంద చిహ్నం వున్నది. ఎవరతడని అడిగాడు.

''ప్రభూ! అతనొక సన్యాసి.''

''అంటే!''

''సర్వసంగ పరిత్యాగం చేశాడు. అతడికి నా అనే వాళ్లు లేరు. దూషణభూషణలను లెక్కపెట్టడు. వాంఛలను చంపుకున్నాడు. ఎవరైనా ఇంత పెడితే తింటాడు, లేకపోతే ఆపూటకు లేదు. నిర్విచారంగా తిరుగుతాడు. వ్యాధికి వగ వగవడు; మరణానికి వెరవడు.

## మహాభినిష్క్రమణం

ఆరాటపడుతున్న గౌతమునిమనస్సులో ఆలోచనలు రేకెత్తినవి. ఇంటికిపోయి ఆలోచించసాగాడు. దుఃఖమయ మైన ప్రాపంచికజీవితాన్ని విసర్జించి, నిర్విచారంతో ఆ సన్యాసివలె జీవిస్తే? ప్రపంచంలోని బాధలకు కారణం ఏమి టని శోధిస్తే? ఋషులవలె తపస్సుచేసి, జ్ఞానమార్గాన్ని తెలుసుకుంటే? ఈవిధంగా ఆయన ఆలోచనలు పరిపరివిధాల నడచినవి. చివరకు ఆయనమనస్సు ఒకనిశ్చయానికి వచ్చింది.

అది చైత్రపౌర్ణమి. అంతఃపురంలో కోలాహలం అణగింది.

నగరం సద్దుమణిగింది. యశోధర ప్రక్కన హంస తూలికాతల్పంమీాద పడుక్ను గౌతముడు లేచాడు. ప్రశాం

తంగా నిద్రపోతున్న ప్రేయసిని చూశాడు. గుండెకు నిబ్బరం చెప్పుకున్నాడు. తల్పందిగి, ప్రక్కనే మరొక మంచంమీద నిద్రిస్తున్న కుమారుని చూశాడు. ప్రేమ పొంగింది. ముద్దు పెట్టుకోబోయాడు. కాని బాలుడు నిద్రలేస్తాడేమో! గుండె రాయిచేసుకొని బైటికి నడిచాడు.

తండ్రి, రాజ్యం, ప్రేయసి, ముద్దుబిడ్డ, సర్వసౌఖ్యాలు-వీటన్నిటినీ విసర్జించి, ఎక్కడికో, ఎందుకో? మానవ మాత్రుడు చెయ్యగల పనేనా అది!

అంతఃపురంనుంచి బైటికివచ్చి, అశ్వచోదకుడు చన్నడిని పిలిచి, తన అనురాగానికి పాత్రమైన అశ్వం 'కంటక'ను ఆయత్తం చెయ్యమన్నాడు. గుఱ్ఱపుడెక్కల చప్పుడు నగర వీధులలో ఎవరికీ వినపడకుండా డెక్కలకు దూదిముద్దలుకట్టి, చన్నడు వెంటరాగా, గౌతముడు కపిలవస్తునగరంనుంచి నిష్క్రమించాడు.

అదే గౌతముని మహాభినిష్క్రమణం.

తెల్లవారింది. ఒకనదీతీరానికి చేరారు. గౌతముడు తన దుకూలాభరణాలను, అశ్వాన్ని చన్నడికి ఇచ్చి యింటికి పొమ్మన్నాడు. గుడ్ల నీరుగ్రుక్కుకుంటూ, నోట మాటరాక, ఖిన్నుడై చన్నడు తనయువరాజును విడచి కపిలవస్తుకు మరలాడు.

గౌతముడు నది దాటాడు. శిరసు ముండనం చేయించుకున్నాడు. కాషాయగుడ్డలు కట్టాడు. సత్యాన్వేషణ ప్రారంభించాడు.

భిక్షుకజీవితంలో దొరకినపూట తిన్నాడు; లేనిపూట

లేదు. కాని, కనపడిన ప్రతియోగినీ, ప్రతిసన్యాసినీ, ప్రతితపస్వినీ ''మానవుడు పొందవలసిన నిజమైన జ్ఞానం ఏమి''టని అడిగాడు. అందరు చెప్పినదీ విన్నాడు. గౌతమునికి తృప్తి కలుగలేదు.

ఆధివ్యాధులకు, జరామరణాలకు కారణం ఏమిటి? క్లేశమయమైన జీవితానికి నిర్వాణమార్గం ఏది? ఇదే గౌతముని అన్వేషణ.

ఎంతోమంది ఆయనకు ఎన్నో మార్గాలు చెప్పారు. శరీరాన్ని కార్శ్యపెట్టి కఠోరతపస్సుచేస్తే, ఆత్మ పరిశుద్ధమై పరమాత్మను కనుక్కొంటుంది. పరమాత్మను కనుక్కోవడమే నిర్వాణం పొందడం అని కొందరు చెప్పారు. అదేదో చూడామనుకున్నాడు. ఆయనకు మరొక అయిదుగురు సహాచరులు దొరికారు.

ఆరుగురూ ఒక అడవిలోకి వెళ్లి, ఉపవాసదీక్ష పూని తపస్సు ప్రారంభించారు. కొన్నాళ్ళకు వారిశరీరాలు శల్యాలయినాయి. వారు కంఠగతప్రాణులయారు. గౌతముడు శోషవచ్చి పడిపోయాడు. కొంతసేపటికి తెప్పరిల్లుకొని, 'ఇక నేను ఉపవాసాలు చెయ్యను' అన్నాడు. అక్కడనుంచి బయలుదేరాడు. అతనిసహాచరులకు అతనిమీద విశ్వాసం పోయింది. అతనిని వదలి వారు వెళ్ళిపోయారు.

మళ్ళీ భిక్షాటనచేసి, గౌతముడు తనిశరీరదార్ఢ్యాన్ని సంపాదించుకున్నాడు. శరీరం శుష్కించినప్పుడు మనస్సు నీరసంగా వుంది. శరీరంలో సత్త్వం చేరగానే బుద్ధి చురు

కుగా పనిచేస్తున్నది. కాబట్టి శరీరాన్ని శుష్కింపచేసినందు వల్ల జ్ఞానోదయం కలుగుట కల్ల అని నిశ్చయించుకున్నాడు.

క్లేశరహితమైన జీవితానికి మార్గం ఏమిటని అహర్నిశములు ఆలోచిస్తూ, ఒకచోటనుంచి మరొకచోటకు తిరుగుతూ చిట్టచివరకు మగధరాజ్యంలోని గయపట్టణ పరిసరాలకు చేరుకున్నాడు. అచ్చటివనంలోని ఒక అశ్వత్థ వృక్షంక్రింద కూర్చున్నాడు. జ్ఞానోదయం అయినదాకా ఇక్కడనుంచి లేవనని నిశ్చయించుకున్నాడు.

తపోదీక్షతో, నిశ్చలుడై అశ్వత్థవృక్షంక్రింద పద్మాసనం వేసుకొని, అంతర్లీనుడై వున్న ఆమహాతేజస్విని చూసి, సుజాత అనేగృహిణి పాలు తెచ్చి అక్కడపెట్టేది. కన్నులు తెరచినప్పుడు ఆకలివేస్తే ఆ పాలు త్రాగేవాడు, కాని దీక్షను మాత్రం విడువలేదు. నలభై తొమ్మిది రోజులు గడిచాయి.

## జ్ఞానోదయం

ఆనాడు వైశాఖపూర్ణిమ. ప్రస్ఫుటమైన, ప్రశాంతమైన వెన్నెల. గౌతమునిముఖం ప్రఫుల్లమైంది. పెదవులు మందహాసం చేశాయి. కనులు విప్పారాయి. గౌతమునికి జ్ఞానోదయమైంది. జీవితధర్మం బోధపడింది. "సత్కర్మ ఆనందాన్ని కలిగిస్తుంది; దుష్కర్మ దుఃఖాన్ని కలిగిస్తుంది." ఇదే లోకధర్మం. ఇన్నాళ్ళు తాను అన్వేషించినసత్యం తన కన్నులకు కట్టిందని గౌతముడు పరవశుడైనాడు. అజ్ఞానోదయంతో ఆయన బుద్ధుడైనాడు. బుద్ధుడు నిర్వాణమార్గాన్ని తెలుసుకున్న ఆస్థలం యీనాటికీ, బౌద్ధులకూ, హిందువు

లకూ పవిత్రమైనది. ఆ అశ్వత్థవృక్షం, బోధివృక్షం అనే మన్ననతో యీనాటికీ పూజింపబడుతున్నది.

బోధివృక్షచ్ఛాయలనుంచి బైటికినడవడానికి ముందే, బుద్ధుడు తనధర్మాన్ని నిర్ణయించుకున్నాడు. జీవితమంతా కర్మఫలంతో కూడివుంది. యజ్ఞయాగాదులను చేసినందువల్ల జీవహింసతప్ప, మానవునికి వేరేసత్ఫలం ఏమీలేదు. శరీరాన్ని శోషపెట్టి తపస్సులుచేసినందువల్ల బాధపడడంతప్ప ముక్తిలేదు. మానవునికి నిర్వాణమార్గం, యీ రెండు మార్గాలకూ మధ్యవున్నది. అదేమధ్యేమార్గం. దీనినే తరువాత మాధ్యమికవాదం అన్నారు.

జ్ఞానోదయం అయినతరువాత బుద్ధుడు, గయనుంచి కాశీకి బయలుదేరాడు. కాశీకి నాలుగుమైళ్ళలోవున్న సారంగనాధ్‌వనం చేరాడు. తనతోకొన్నాళ్లు తపస్సుచేసి వెళ్లిపోయిన అయిదుగురు మునులు, బుద్ధుడికి అక్కడ కనుపించారు. మొట్టమొదట తనబోధలను, ఆయన వారికి చెప్పాడు.

సత్కర్మ ఆనందాన్ని కలిగిస్తుంది! దుష్కర్మ దుఃఖాన్ని కలిగిస్తుంది. కర్మఫలాన్ని అనుభవించవలసిన మానవులు, యజ్ఞయాగాదులను చెయ్యడంవల్లగాని ఉగ్రతపస్సును చెయ్యడంవల్లగాని నిర్వాణం పొందరు.

జన్మ ఒకబాధ, వ్యాధి ఒకబాధ, జర ఒకబాధ; దుఃఖం ఒకబాధ, నిరాశ ఒకబాధ.

బాధకు ప్రధానకారణం వాంఛ; వాంఛవల్లనే పున

ర్జన్య; వాంఛవల్లనే అనేకర్మలు చెయ్యడం; వాంఛతీరక పోవడంవల్ల దుఃఖపడడం.

వాంఛలను వర్జించడంవల్ల మానవుడు బాధకు అతీతుడౌతాడు.

వాంఛారహితమైన, బంధరహితమైన, బాధారహితమైన, జీవితానికి ధర్మప్రవర్తన అవసరం. ధర్మప్రవర్తనకు ఎనిమిది నియమాలు: అదే అష్టాంగమార్గం.

నిజమే మానవునికి మార్గదర్శిని అనే విశ్వాసం.

ఎల్లప్పుడూ ప్రశాంతచిత్తంతో వుండడం.

ఎప్పుడూ అసత్యం చెప్పకపోవడం.

దొంగతనము, జీవహింస చెయ్యకపోవడం.

ఇతరులకు క్లేశాన్ని కలిగించే వృత్తిని అనుసరించక పోవడం.

ప్రజాహితమైన ప్రవర్తననే ఎల్లప్పుడూ అనుసరించడం.

సుఖదుఃఖాలను సమానంగాయెంచి, నిర్విచారంగా వుండటం.

ఏకాగ్రతతో శాంతిని అనుభవించడం.

ఈ ఎనిమిది నియమాలను పాటించడానికి, మొదట మానవుడు సత్ప్రవర్తన అలవరచుకోనాలి. దానికి అయిదు విధులు వున్నాయి.

హింస చేయరాదు

అసత్య మాడరాదు

దొంగిలించ రాదు

వ్యభిచరించ రాదు

మద్యపానము చేయరాదు

ఈ అయిదు విధులకు పంచశీల అని పేరు.

ఈ విధంగా ధర్మమార్గాన్ని అనుసరించాలి. ఇదే లోకానికి ధర్మచక్రం.

బుద్ధుడు సారంగనాథ్‌లో చేసిన మొదటిబోధకే ధర్మ చక్ర ప్రవర్తన అని పేరు.

అప్పటినుంచీ బుద్ధుడు, కాశీరాజ్యంలోనూ, మగధ రాజ్యంలోనూ అనేకప్రాంతాలలో తిరిగి ధర్మబోధ చేశాడు.

గొప్పయజ్ఞాన్ని చెయ్యడానికి సన్నాహాలుచేస్తున్న మగధరాజు బింబిసారుని వద్దకుపోయి, నోరులేని పశువులను చంపడం దుష్కర్మతప్ప పుణ్యమార్గం కాదని వాదించి, కరుణామతాన్ని బోధించాడు. బింబిసారుడు బుద్ధునిబోధనలను అంగీకరించి, తనరాజ్యంలో బౌద్ధమతప్రచారానికి చాలా సహాయంచేశాడు.

## దేవుడు

బుద్ధుడు తనబోధలలో ఎక్కడా దేవుని ప్రసక్తి తెచ్చినట్లు కనపడదు. మానవుని జీవితమంతా కర్మఫలాన్ని అనుభవించడంతో సరిపోతున్నప్పుడు దేవుని అవసరం ఏమున్నది! దుష్కర్మకు దుఃఖమే ఫలం అయినప్పుడు, దేవుడు ఆదుఃఖాన్ని వారించడు. సత్కర్మకు ఆనందం ఫల మైనప్పుడు, దేవుని అనుగ్రహం ఏమీలేదు. సద్ధర్మాన్ని అవలంబించి, క్లేశరహితమైన జీవితాన్ని అనుభవించవలసిన

మానవుడు, దేవునిగురించి తాపత్రయపడవలసిన అవసరం లేదు.

తాను దేవుడననిగాని, దేవుని అవతారమూర్తిననిగాని బుద్ధుడు ఎక్కడా చెప్పుకోనలేదు. అందువల్లనే, బుద్ధుని నిర్యాణానంతరం, మూడు, నాలుగు వందల సంవత్సరాలదాకా, బౌద్ధసంఘారామాలలో కట్టిన స్తూపాలమీది శిల్పాలలో బుద్ధుని చిహ్నాలకు భక్తులు పూజలు చేస్తున్నట్టు చెక్కబడినదిగాని, బుద్ధునిరూపం చెక్కబడలేదు. తరువాత, బౌద్ధులు బుద్ధునికి దేవత్వం ఆపాదించి, బుద్ధునికి రూపకల్పన చేయసాగారు. బుద్ధవిగ్రహాలను చెక్కడం, క్రీస్తుశకానికి ఒకటిరెండువందల సంవత్సరాలముందు ప్రారంభమైంది. బుద్ధుని నిజమైనరూపం తెలిసినవారు ఆనాడు ఎవ్వరూలేరు. తరతరాలుగా వింటూవచ్చిన వర్ణననుబట్టి, శిల్పులు తమ ఊహాప్రకారం బుద్ధరూపాన్ని చెక్కారు. క్రమంగా బుద్ధ విగ్రహాన్ని పూజించడం ప్రారంభమైంది.

బుద్ధునికి దేవత్వం ఆపాదించడం ఎప్పుడు ప్రారంభమైందో, అప్పుడే బుద్ధునికి అవతారాలను కల్పించడంకూడా ప్రారంభమైంది. ఈకల్పనప్రకారం, బుద్ధుడు సిద్ధార్థగౌతముడుగా జన్మించడానికి పూర్వం, అనేక రూపాలలో అనేక జన్మలెత్తి, ప్రతిజన్మలోనూ ఉత్తమప్రవర్తనవల్ల, సచ్ఛీలం వల్ల; సహజీవులకు మహోపకారాలనుచేసి, ఆ జన్మనుంచి, తరిస్తూ వుంటాడు. ఈ అవతారానికి 'బోధిసత్త్వ' అనిపేరు. బోధిసత్త్వాల గాథలకు జాతక కథ లనిపేరు. కొంతకాలం జరిగేటప్పటికి, జాతకకథలు విస్తారంగాపెరిగి, ఎంతోమంది

బోధిసత్త్వులు వెలసారు. ఈబోధిసత్త్వులు, భక్తుల వరాలను చెల్లిస్తారు. అంచేత బోధిసత్త్వుల రూపాలకు ఆరాధన, అర్చనలు ప్రారంభమయాయి. ప్రతివ్యక్తీకూడా సత్ప్రవర్తనవల్ల క్రమంగా బోధిసత్త్వుడుగా పరిణామం పొందవచ్చును.

## మూడు శాఖలు

ఈవిధమైనబోధ, బౌద్ధమతంలో ప్రవేశించగానే, అదొక సాంప్రదాయంగా పరిణమించింది. దానికే 'మహాయాన' అనిపేరు. కొత్తసాంప్రదాయానికి 'మహాయాన' అని పేరురాగానే, పాతసాంప్రదాయానికి 'హీనయాన' అని పేరుపడింది.

మహాయాన సిద్ధాంతప్రకారం, బుద్ధుడు ఒక మహాపరమాత్మ. ఈ పరమాత్మకు మూడు దేహాలు వున్నాయి. అవి, ధర్మకాయము, సంభోగకాయము, నిర్మాణకాయము.

ధర్మకాయము విశ్వమంతా పరివ్యాప్తమై వుంటుంది. సంభోగకాయం స్వర్గలోకంలో వుంటుంది. సృష్టిలోని జీవరాసులన్నీ బుద్ధుని ధర్మకాయంలో లీనమయేవరకూ సంభోగకాయం స్వర్గలోకంలో వుంటుంది. నిర్మాణకాయమే, భూలోకంలో కనుపించిన బుద్ధావతారం. తక్కిన రెండు కాయాలలో బుద్ధునిరూపం భూలోకంలో కనుపడదు.

ధర్మకాయంలో విశ్వపరివ్యాప్తుడైన బుద్ధునిపేరు, ఆదిబుద్ధుడు. స్వర్గలోకంలో పరిపాలనచేసే సంభోగకాయంలో వుండే బుద్ధునిపేరు, అమితాభుడు. నిర్మాణ

కాయంలో, భూలోకంలో అవతరించిన బుద్ధుని పేరు, గౌతమ బుద్ధుడు.

బోధిసత్త్వులలో పరిపూర్ణమైన మూర్తి పేరు, అవలోకితేశ్వరుడు. ఇతడు పద్మాన్ని చేతిలో ధరించి వుంటాడు. అందుకే అతనికి పద్మపాణి అనికూడా పేరు. అతడు మహా కారుణికుడు. ఆవేదనలో ఆశ్రయించినవారిని అధోలోకం నుంచికూడా కరుణతో ఉద్ధరిస్తాడు.

ఈవిధంగా మహాయానమతం ప్రబలింది. బౌద్ధవిహారాలలో అర్చనలు, ఆరాధనలు ఎక్కువయాయి.

కొంతకాలానికి, పురుష దేవతలకు, వారిశక్తి స్వరూపిణులుగా భార్యలు కల్పించబడ్డారు. పురుషరూప దేవతలతో పాటు స్త్రీ దేవతలు వెలసారు. స్త్రీపురుష దేవతల రూప కల్పన, ఆ దేవతలకు తాంత్రికశక్తులను ఆపాదించడం, ఆ శక్తులను సంపాదించడంకోసం భక్తులు ఉగ్రాచారాలను అనుసరించడం, బౌద్ధమతంలో మూడవదశగా పరిణమించింది. ఈసాంప్రదాయానికే వజ్రయానం అని పేరు.

ఈ వజ్రయాన సాంప్రదాయంలో అమితాభునికి ప్రజ్ఞాపారమత అనేశక్తిస్వరూపిణీ, అవలోకితేశ్వరునికి తార అనేశక్తిస్వరూపిణీ స్త్రీ దేవతలుగా కల్పనచేయబడినారు. మంత్రాలూ, తంత్రాలూ, సాధనలూ మొదలైన కలాపం పెరిగింది. వజ్రయాన బౌద్ధవిహారాలలో, స్త్రీపురుషులు కలసి యోగసాధనలు చెయ్యడం, చివరకు అవినీతిప్రవర్తనలోకి దిగింది.

అయితే, దేశమంతటా వజ్రయానం వ్యాపించలేదు.

కొన్ని చోట్ల హీనయానబౌద్ధులు బలంగా వుంటే మరికొన్ని చోట్ల మహాయానబౌద్ధులు బలంగావుండేవారు. కొన్ని చోట్ల వజ్రయానబౌద్ధులు ఎక్కువసంఖ్యలో వుండేవారు.

బౌద్ధమతంలో ఏర్పడిన మూడు శాఖలను గురించీ సూక్ష్మంగా చెప్పాలంటే:

ప్రతివ్యక్తీ సత్ప్రవర్తనవల్ల, అష్టాంగమార్గాన్ని అనుసరించడంవల్ల నిర్వాణం పొందవచ్చును అనిబోధించేది, హీనయానం.

అష్టాంగమార్గాన్ని అనుసరించడంవల్లనే కాక. బుద్ధుని, బోధిసత్త్వులను ఆరాధించి, వారికటాక్షంవల్ల నిర్వాణం పొందవచ్చును అనిబోధించేది, మహాయానం.

యోగాచారంవల్ల తాంత్రికశక్తులను సంపాదించి, నిర్వాణం పొందవచ్చును అనిబోధించేది, వజ్రయానం.

బుద్ధుడు ప్రప్రథమంలో బోధించిన ధర్మానికి చిలవలూ పలవలూ కల్పించి, హీనయాన, మహాయాన, వజ్రయానాలనే శాఖలు ఏర్పడేసరికి, హిందూమతం మళ్లీ విజృంభించడం ప్రారంభమైంది.

బౌద్ధసంఘంలో, మొదటిమెట్టు ఉపాసకులు. భిక్షులు, శ్రమణులు, అర్హులు వలె ఉపాసకులు బౌద్ధసంఘారామాలలోవుండి, సర్వసంగపరిత్యాగం చెయ్యనక్కర లేదు.

ఇతరమతస్థులైన ప్రజలందరిలాగనే సంసారంచేస్తూ, కృషిక, వ్యాపారాది వృత్తులను అవలంబిస్తూ, బుద్ధుడుబోధించిన పంచశీలాలను పాటించేవారు ఉపాసకులు. వీరిప్రధాన ధర్మం, 'బుద్ధం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి,

సంఘం శరణం గచ్ఛామి, అనేసూత్రంలో ఇమిడిఉంది. బౌద్ధ భిక్షుకులకు ఉపాదానం పెట్టడం వీరివిధి.

## భిక్షుసంఘాలు

బౌద్ధమతం విస్తరిల్ల డానికిపూర్వం, భిక్షాటనపై జీవించే సన్యాసులు వుండేవారు కాని, పెద్దపెద్దమఠాలుగా భిక్షుకులు స్థావరం ఏర్పరచుకోవడం బౌద్ధభిక్షుకుల సంఘాలు ఏర్పడినతరువాతనే. ఒకొక్కచోట వందలకొద్దీ భిక్షుకులు సంఘాలు ఏర్పరచుకున్నప్పుడు, గృహస్థులుపెట్టే ఉపాదానాలవల్ల భిక్షుసంఘాలు నిలువలేవు. అలాటిసంఘాలకు విస్తారంగా ఆస్తివుండాలి. ధర్మాత్ములైన ఉపాసకులు పుష్కలంగా డబ్బుయిచ్చేవారు; ప్రభువులు గ్రామాలను దానంచేసేవారు. వీటిఆదాయాలవల్లనే బౌద్ధసంఘాలు నిలువగలిగినవి.

ఉపాసకుల దానధర్మాలమీాద ఆధారపడి జీవించే భిక్షుసంఘాలపైన పెద్దబాధ్యత వుండేది. వారు తమప్రవర్తన కళంకరహితంగా వుండేటట్టు చూసుకోవాలి. ఏమాత్రం అప్రతిష్ఠ పొందినా ఉపాసకుల అభిమానం పోతుంది; ఆదరణ వుండదు.

బౌద్ధమతం మానవుని ముక్తికి కావలసిన మార్గాన్ని మాత్రమే చెప్పింది. పూర్వజన్మకర్మఫలాన్ని మానవుడు యీజన్మలో అనుభవిస్తాడు. ఈ జన్మలో చేసిన కర్మనుబట్టి ముందుజన్మ వుంటుంది. ఈ జన్మలో కర్మచెయ్యకుండా, వాంఛలనుంచి మనస్సును విముక్తి పొందించుకుంటే నిర్వాణం లభిస్తుంది. కాబట్టి, యీజన్మలో మానవుని ప్రవర్తన ఇలా

వుండాలి అని ఎనిమిది ధర్మాలను బౌద్ధమతం బోధించింది. ఇవి కేవలం ప్రవర్తనకు సంబంధించినవే.

అయితే, బౌద్ధమతానికి పూర్వంనుంచీ ప్రజలు కొన్ని ఆచార సాంప్రదాయాలను అనుసరిస్తూవచ్చారు. తరతరాలుగావచ్చే ఆచారాలనూ, సాంప్రదాయాలనూ ఒక్క పెట్టున ఎవరూ విడువలేరు. అంచేత, బౌద్ధధర్మాన్ని స్వీకరించిన ఉపాసకులుకూడా వంశానుగతమైన ఆచారాలను విడువలేదు. జననంమొదలు ఆమరణాంతం, షోడశసంస్కారాలను యథావిధిగా జరిపించుకొనేవారు. ఒకప్రక్క బౌద్ధభిక్షులను ఆదరిస్తూ, బౌద్ధసంఘాలకు దానాలను యిస్తూ, మరొకప్రక్క బ్రాహ్మణపౌరోహితులను పోషిస్తూ, వారిచేత పౌరోహిత్యం చేయించుకొనేవారు.

ఈకారణంవల్లనే, బౌద్ధమతాన్ని హిందూమతానికి విరుద్ధమైన మతంగా హిందువులు భావించలేదు. బౌద్ధులను జాతిభేదంలేని నాస్తికులుగా నిరసించేవారు. కాని, కాలక్రమాన బౌద్ధమతం క్షీణించినప్పుడు ఆమతావలంబులను హిందూమతస్థులుకారని వెలివెయ్యడం జరగలేదు.

శంకరాచార్యుడు హిందూమత పునరుద్ధరణకు పూనుకొని, శంకరమఠాలను స్థాపించి, శివాలయాలను కట్టించి, పూజాకలాపాన్ని ఏర్పరచడంతో బౌద్ధమతంపట్ల సామాన్య సంసారులకు నీరసభావం కలిగింది.

ఉధృతంగా ప్రబలుతున్న అద్వైతమతమూ, ఆలయాలలో గొప్ప ఉత్సవాలతో జరిగేపూజలూ, ఆలయానికి వెళ్ళి దేవుని శరణు జొచ్చితే పాపాలు పోతాయనే గాథ

విశ్వాసమూ, మతంపట్ల ఉదాసీనులుగావున్న ప్రజానీకాన్ని విశేషంగా ఆకర్షిస్తూవుంటే, బౌద్ధమతాన్ని అవలంబిస్తున్న సామాన్య సంసారులకు ఒక దారుణమైన ఆవేదన ఆరంభమైంది.

నిత్యజీవనానికి ఉపాధిని సంపాదించుకోవలసిన పరిస్థితిలో కర్మచెయ్యకుండా వుండటం అసాధ్యం. ప్రతివ్యక్తీ, తనకర్మను ఫలితాన్ని అనుభవిస్తూవుంటే విముక్తి ఎలాగ? తెలిసో తెలియకో మనిషి చేసే పాపాలకు పరిహారం కావాలి. పాపాల్ని పరిహరించి మానవుణ్ణి కాపాడగల దేవుడు కావాలి. ఇలాంటి ఆవేదన పడుతున్న సంసారులకు మళ్లీ హిందూమతం శరణ్యమైంది.

పైగా, బౌద్ధవిహారాలలో వజ్రయానంవల్ల వచ్చిన అవినీతి, ఉపాసకసంసారులకు ఆ బౌద్ధవిహారాలంటే వెగటు పుట్టించింది.

బౌద్ధమతావలంబులైన సంసారులు క్రమంగా హిందూ దేవాలయాలకు పోవడం, హిందూ ఆచారాలను ఉత్సాహంతో పాటించడం సాగించారు. ఈమార్పును హిందువులు ప్రతిఘటించలేదు. బౌద్ధులను వెలివెయ్యలేదు. తమలో ఒకరుగానే భావించారు.

అంతేకాదు. బుద్ధుని మహావిష్ణువు అవతారాలలో ఒకనిగా ప్రకటించి, హిందువులు బుద్ధుణ్ణికూడా తమ దేవుళ్లలో ఒకణ్ణిగా చేసుకున్నారు.

తమలో కలవకుండా బౌద్ధులను హిందువులు ప్రతిఘటించివుంటే, బౌద్ధమతం యీనాడుకూడా చాలాఎక్కువ

గానే భారత దేశంలో వుండేదేమో కాని, బౌద్ధులను తమలో కలుపుకోవడంవల్లా, బుద్ధుణ్ణి తమ దేవుళ్లలో ఒకనిగా స్వీకరించడంవల్లా, బౌద్ధమతానికి ప్రత్యేకత లేకుండా చేశారు హిందువులు,

అయితే, బౌద్ధధర్మాలుమాత్రం భారత దేశంలో మాసిపోలేదు. ఆధర్మాలన్నిటినీ హిందువులు తమ మత ధర్మాలుగానే అంగీకరించారు.

బౌద్ధమతానికి పూర్వం మాంసభక్షణ విషయమై నిషేధం ఏకులానికీ లేదు. బుద్ధుడు జీవహింసకూడ దన్నాడు. బౌద్ధమతావలంబులు మాంసభక్షణ మానివేశారు. బౌద్ధ మతావలంబులలో కులభేదం లేదు. అందరూ మాంసభక్షణ వర్జించారు. కాని, ఈనాడు ఒకకులంగా మాంసభక్షణను వర్జించినవారు, బ్రాహ్మణులు, వైశ్యులు. ఇది, తమ మతాన్ని నిలబెట్టుకోడానికి వేదమతస్తులు చేసిన ఒక గొప్పత్యాగమే.

వేదమతస్థులు మాంసభక్షణను విసర్జించినందు వల్ల వచ్చిన ఒకగొప్ప అనర్థంఏమిటంటే, కులభేదాలు మరింత కఠినంకావడం. బుద్ధునికిపూర్వం కులభేదాలు కేవలం వృత్తినిబట్టీ, అధికారాన్నిబట్టీ వుండేవి. సహపంక్తిభోజనాలు ఏకులానికీ నిషిద్ధంకావు.

బుద్ధునితరువాత వెయ్యిసంవత్సరాలకు, శంకరాచార్యునికాలం వచ్చేటప్పటికి మాంసభక్షణ చెయ్యనివారు, మాంసభక్షకులతో సహపంక్తి భోజనాలను ఎంతమాత్రం సహించని ఆచారం ఏర్పడింది.

బౌద్ధమతాన్ని విసర్జించి హిందూమతంలో చేరిన కుటుంబాలలో, అంతకుపూర్వం బ్రాహ్మణకులంగా పరిగణింపబడని వారెందరో బ్రాహ్మణకుటుంబాలుగా పేరుపెట్టుకున్నారు. ఈనాడు భారతదేశంలో బ్రాహ్మణులలో 1500 శాఖాభేదాలు వున్నాయి. వీరిలో కొన్నిశాఖలవారితో తక్కినవారు సహపంక్తిభోజనాలు చెయ్యరు.

శంకరాచార్యుల అద్వైతబోధలవల్లనూ, రామానుజాచార్యుల విశిష్టాద్వైతబోధలవల్లనూ, బౌద్ధమతావలంబులసంఖ్య క్రీ. శ. 12 వశతాబ్దంనాటికి చాలాతగ్గిపోయింది. తరువాత, ఇస్లాం, క్రైస్తవమతాల ప్రవేశంతో బౌద్ధప్రచారం అసలే అంతరించింది. 1951 లో మనదేశంలో తీసిన జనాభా లెక్కలప్రకారం, దేశంలోని 36 కోట్ల ప్రజలలో, 1,80,000 మంది మాత్రమే బౌద్ధమతస్థులని తేలింది. అంటే, ప్రతిపదివేల ప్రజలలో ఆరుగురుచొప్పున బౌద్ధమతస్థు లన్నమాట.

హిందూమత విజృంభణవల్ల బౌద్ధమతం చాలా కృశించిపోతే, ఇస్లాంమతంవల్ల అది రూపుమాసి పోయింది. పుష్యమిత్రశుంగ, మిహిరగుల, శశాంక మొదలైన రాజులు, బౌద్ధమతాన్ని రూపుమాపడానికి ప్రయత్నం చేశారు. కాని, విఫలు లయారు. నలంద విశ్వవిద్యాలయాన్ని ధ్వంసంచేసి, అచ్చటి వేలాదిబౌద్ధగ్రంథాలను తగులబెట్టి, బీహారులోని బౌద్ధవిహారాలను నేలమట్టంచేసి ముస్లింరాజులు బౌద్ధమతాన్ని భారతదేశంలో రూపుమాపారు.

బౌద్ధమతంలో కాలక్రమానవచ్చిన మార్పులవల్లనూ, ఇస్లాందాడివల్లనూ, క్రీ. శ. 15వ శతాబ్దంనాటికి జన్మభూమి అయిన భారత దేశంలో బౌద్ధమతం రూపుమాసి పోయింది.

కాని, టిబెట్, సింహాళము, బర్మా, సయాం, కంబోడియా, చైనా, జపాను, కొరియా, దేశాలలో నిలబడింది. సింహాళము, బర్మా, సయాం, కంబోడియా దేశాలలో నేటికీ ఉచ్ఛస్థితిలోవున్న బౌద్ధమతము, హీనయాన శాఖకు చెందినది.

చైనా, జపాన్, కొరియా దేశాలలో మహాయాన శాఖ, టిబెట్టులో వజ్రయాన శాఖలలో బౌద్ధమతం వ్యాపించింది.

టిబెట్టు దేశీయుల విశ్వాసప్రకారం అమితాభుని అవతారం, పాంచెన్ లామా; అవలోకితేశ్వరుని అవతారం, దలై లామా.

## ముఖ్యగ్రంధములు

బౌద్ధమతగ్రంథాలలో ముఖ్యమైనదీ, అతిపురాతనమైనదీ, 'త్రిపీటక.' ఇది మూడుభాగాలు. వినయపీటక, సూత్రపీటక, అభిధర్మపీటక.

వినయపీటకము, బౌద్ధులు అనుసరించవలసిన ప్రవర్తనను బోధిస్తుంది. బౌద్ధులు ఏనియమాలను పాటించాలో, ఏఏపనులను చెయ్యకూడదో వినయపీటకము బోధిస్తుంది.

సూత్రపీటకము బుద్ధునిబోధలు, బుద్ధునిగాధలు చెప్తుంది. జాతకకథలు సూత్రపీటకములోనే వున్నాయి. తన

పూర్వజన్మాలనుగురించి, తనఅనుచరులకు వివరించడానికి, ఈజాతకకథలన్నిటినీ బుద్ధుడే చెప్పాడని ప్రతీతి.

అభిధర్మపీటకము, వేదాంతగ్రంథము.

ఈమూడు పీటకములు, పాలిభాషలో రచించబడినవి. ఇవి హీనయానశాఖకు చెందిన బౌద్ధులకు మూల గ్రంథాలు.

మహాయానశాఖకు చెందిన గ్రంథాలసంఖ్య చాలా ఎక్కువ, వీటిలో ముఖ్యమైనవి: లలితవిస్తర, సద్ధర్మపుండరీక, వజ్రచ్ఛేదిక. ఇవిసంస్కృతంలో వ్రాయబడినవి. వీనిలో లలితవిస్తర బుద్ధదేవుని జీవితగాథ. తక్కిన రెండూ మతధర్మచర్చలు.

ఇవికాక, ఏవ్యక్తీ తనజీవితంలో పూర్తిగా చదువలేనన్ని గ్రంథాలు, మహాయానశాఖబౌద్ధులు రచించినవి వున్నాయి.

# జైనమతం

జయించినవాడు, జినుడు. జినుని అనుచరులు జైనులు. జైనమతంఅంటే, జినుడుబోధించిన మతం. జినుడు జయించినది ఏమిటి? సంసారం. కాబట్టి సంసారబంధాల నుంచి విముక్తిపొందినవారు జైనులు.

జైనులుఅనేపేరు యీమతస్థులకు మొట్టమొదటిలో లేదు. ఈమతస్థులను 'నిర్గ్రంథు' లనేవారు. అంటే బంధాలను త్రెంచుకున్నవా రన్నమాట. బుద్ధుని కాలంలోనూ, అశోకునికాలంలోనూ జైనులకు, నిర్గ్రంథులనే పేరే వాడుకలోవుండేది. తరువాతనే జైనులనేపేరు వాడుకలోకి వచ్చింది.

జైనమతస్థాపకుడు, వర్ధమానమహావీరు డని ప్రతీతి. కాని జైనమతస్థులు ఆమాటను అంగీకరించరు. నిజానికి, నిర్గ్రంథులనేమతస్థులు వర్ధమానునికిపూర్వమే భారతదేశంలో వున్నారు. వర్ధమానునికి రెండువందల సంవత్సరాలకు పూర్వం, యీమతస్థులకు ఆచార్యుడు, పార్శ్వనాథుడు.

జైనమతస్థుల విశ్వాసప్రకారం, ఆమతబోధ చెయ్యడానికి ఇప్పటికి ఇరవైనాలుగుమంది మహాపురుషులు ఉద్భవించారు. వారిని తీర్థంకరులు అంటారు. వారే జినులు. ఇరవైమూడవ తీర్థంకరుడు పార్శ్వనాథుడు; ఇరవైనాల్గవ తీర్థంకరుడు వర్ధమానుడు.

పార్శ్వనాథుని బోధనలలో కొన్ని మార్పులు ప్రవేశపెట్టి, జైనమతాన్ని బాగావ్యాప్తిలోకి తెచ్చినవాడు,వర్ధ

మానుడు. వర్ధమానుని కాలంనుంచే, భారతదేశంలో జైన మతప్రాబల్యం ఎక్కువ అయింది. అందువల్లనే జైనమతాన్ని మొట్టమొదట బోధించినవాడు వర్ధమానుడని చాలామంది చరిత్రకారులు భ్రమపడ్డారు.

అంతేకాదు. జైనమత ప్రధానధర్మాలకు బౌద్ధమత ప్రధానధర్మాలకూ గల పోలికవల్లనూ, బుద్ధుని జీవితానికీ వర్ధమానుని జీవితానికీ గల పోలికలవల్లనూ, బుద్ధుడూ వర్ధమానుడూ సమాకాలికులు కావడంవల్లనూ, చాలామంది చరిత్రకారులు పొరపాటుపడి, జైనమతం, బౌద్ధమతంలో ఒకశాఖ అనికూడా వ్రాశారు, బుద్ధుని మహాపరినిర్వాణానంతరం, ఆయన అనుచరులలో విభేదాలుపుట్టి, కొందరు జైనశాఖను ఏర్పరచారని వ్రాశారు. చారిత్రక పరిశోధన, మతగ్రంథపరిశీలన బాగా జరిగిన తరువాత, చరిత్రరచనలోని యీపొరపాటు సవరించబడింది.

## మహావీరుడు

బుద్ధునికి రెండువందలసంవత్సరాలకు పూర్వమే, నిర్గ్రంథులనే మతస్థులుండేవారని యీనాడు స్పష్టంగా తెలుస్తున్నది. ఈమతాన్ని బాగా ప్రాబల్యంలోకి తెచ్చినవాడు వర్ధమానమహావీరుడు. ఈయన బుద్ధుని సమకాలికుడు. బుద్ధునికన్నముందు వర్ధమానుడు నిర్వాణం చెందాడని కొందరూ, వర్ధమానునికన్నముందు బుద్ధుడు నిర్వాణం చెందాడని కొందరూ చరిత్రకారులు వాదిస్తున్నారు. ఈవిషయంలో ఇదమిత్థమని ఏమీ చెప్పడానికి వీలులేదు.

కాని, ఈమహాపురుషు లిద్దరూ కూడా కొంతకాలం సమ కాలికులని చెప్పడానికి ప్రబలమైన ఆధారాలు వున్నాయి.

విదేహరాజ్యపు రాజధాని వైశాలి. దానిసమీపంలో కుందగ్రామం వుంది. దానికి రాజు, జ్ఞాత్రిక వంశీయుడైన సిద్ధార్థుడు. ఆయనరాణి, లిచ్ఛవిరాజవంశానికి చెందిన త్రిశాల. వీరికి ఒకకుమార్తె, ఇద్దరుకుమారులు. పెద్దకొడుకు నందివర్ధనుడు, రెండవకుమారుడు వర్ధమానుడు.

జైనుల పవిత్రగ్రంథాలైన కల్పసూత్ర, ఆచారాంగ సూత్ర అనేగ్రంథాలలో వర్ధమానుని జీవితగాథ విపులంగా వర్ణించబడింది.

క్రీస్తుశకానికి సుమారు 570 సంవత్సరాల పూర్వం వర్ధమానుడు జన్మించాడని లెక్క. పన్నెండేండ్ల ప్రాయంలో వర్ధమానుడు కొందరు బాలురతో తోటలో ఆడుకుంటూ వుండగా, ఒకమదపుటేనుగు ఆబాలునిమీదకు వచ్చిందట. బాలురందరూ పారిపోయారట. వర్ధమానుడుమాత్రం నిశ్చలంగా అక్కడే నిలబడ్డాడట. మదపుటేనుగు ఘీంకారం చేస్తూ, వర్ధమానునిమీదకు వచ్చిందట. కాని నిర్భయంగా వర్ధమానుడు ఆ ఏనుగుతొండం పట్టుకొని, దానిమీదకు ఎక్కి, దానిని వశపరచుకున్నాడట. అప్పటినుంచీ అతనికి మహావీరుడని బిరుదు వచ్చింది.

వర్ధమానమహావీరుడు యశోద అనే రాజపుత్రిని పెండ్లాడాడు. వారికి జామాలి అనే కుమార్తె పుట్టింది. రాజప్రాసాదంలో సుఖంగా జీవితం గడుస్తున్నది. మహావీరునికి ముప్పదియేండ్లు వచ్చాయి.

అప్పుడు ఆయనలో మార్పువచ్చింది. దానికి కారణం ముఖ్యంగా ఆయనతల్లిదండ్రుల మరణం. వారు జబ్బువల్ల మరణించలేదు. తమవంశాచార ప్రకారం, ఉపవాసదీక్షవల్ల తనువులను విడిచారు. ముసలితనంతో చివికి చావడంకన్న, వ్యాధిపడి మృత్యువునోట పడడంకన్న, మనస్ఫూర్తిగా చావునుకోరి ఉపవాసదీక్షపూని ప్రాణాలను విడచినట్లయితే పునరావృత్తిలేని ముక్తి లభిస్తుందని వారినమ్మకం. ఆవిధంగా చనిపోయిన తల్లిదండ్రులను చూసి మహావీరుడు ఆత్మవిచారంలో పడ్డాడు.

ఈ జీవితం ఏమిటి, మరణం ఏమిటి అనే పరమ సత్యాన్ని తెలుసుకోడానికి నిశ్చయించి, ఇంటినీ, ఇల్లాలినీ విడచి బయలుదేరాడు.

ఇల్లువిడచినది మొదలు పన్నెండు సంవత్సరాలు మహావీరుడు మౌనవ్రతం అవలంబించాడు. పదమూడుమాసములు ఏకవస్త్రుడై తిరిగాడు. ఆ తరువాత, ఆవస్త్రాన్నికూడా విసర్జించాడు. అప్పటినుంచీ తననిర్యాణంవరకూ ఆయన దిగంబరుడుగానే వున్నాడు.

పన్నెండు సంవత్సరాల దీక్షలో, మౌనవ్రతంతో, మహావీరుడు చాలా దేశం తిరిగాడు. దిగంబరుడై, మాటలాడక, ప్రజలు తనను గేలిచేసినా, అవమానించినా ప్రతివచనం చెప్పక, పరమశాంతమూర్తిగా ఆయన దీక్షను నిర్వహించాడు.

మొదట ఆరుసంవత్సరాలు మహావీరునితోపాటు గోశాలమస్కరీపుత్రుడనే మరొకయోగి కూడా కలసివుండే

వాడు. కాని, ఏదో అభిప్రాయభేదంవల్ల వీరిద్దరూ విడిపోయారు. మస్కరీపుత్రుడు ఆజీవికులనే ఒక శాఖను స్థాపించి, వారికి ఆచార్యుడయాడు.

తన నలభై రెండవయేట, ఇల్లువిడచివచ్చిన పదమూడవసంవత్సరంలో, రుజుపాలికానదీ ఉత్తరతీరానవున్న జృంభికాగ్రామ పరిసరంలో, శామకుడనే గృహస్థుని పొలంలో, ఒకసాలవృక్షపు నీడలో, వైశాఖశుద్ధ దశమి నాడు ఉదయం, చంద్రుడు ఉత్తరఫల్గునీనక్షత్రంలో వుండగా, పద్మాసనాసీనుడై తపోదీక్షలో వున్న మహావీరునికి దివ్యజ్ఞానం కలిగింది.

లోకం అనశ్వరమైనది. ప్రాణి, కర్మఫలంవల్ల అనేక జన్మలు ఎత్తుతూ వుంటుంది. కర్మసన్యాసం చేస్తే, పునర్జన్మ లేకుండా చేసుకోవచ్చును. ఇది చాలాకొద్దిమంది దీక్షాపరులకే సాధ్యం. కర్మబంధాలను సంపూర్తిగా త్రెంచుకొని, వాంఛలను పూర్తిగా చంపుకొని, ఉపవాసదీక్షపూని ప్రాయోపవేశం చేస్తే, పునర్జన్మలేకుండా మానవుడు తనఆత్మను విశ్వాత్మలో విలీనం చేసుకోవచ్చును. ఇది మహావీరునికి కలిగిన దివ్యజ్ఞానం.

పార్శ్వనాథునికాలంలో నిర్గ్రంథులు నాలుగు వ్రతాలను పాటించేవారు. అవి: హింస చేయకపోవడం, అసత్యం చెప్పకపోవడం, దొంగతనం చేయకపోవడం, ఆస్తిని కూడబెట్టకపోవడం.

ఈ నాలుగు వ్రతాలకు మహావీరుడు మరొక వ్రతం చేర్చాడు: వ్యభిచరించకపోవడం.

జ్ఞానోదయాన్ని పొంది, తీర్థంకరు డైనతరువాత, మహావీరుడు ముప్పదిసంవత్సరాలు తనబోధలను చేస్తూ, అనేక మందిని తనమతంలో చేర్చాడు. దేశంలో ఆయనకు ఎంతో గౌరవం వుండేది. ఎందరోరాజులు ఆయనను మన్ననలతో అర్చించేవారు.

మహావీరునితల్లి లిచ్ఛవిరాజపుత్రి. మగధరాజైన బింబిసారుని బంధువు. అందువల్ల మహావీరుడు మగధరాజధాని రాజగృహాలో ఎక్కువకాలం వుంటూవుండేవాడు. బుద్ధునికి అంజలిఘటించి,!బౌద్ధమతప్రచారానికి సహాయపడిన బింబిసారుడు మహావీరునిపట్లకూడా అత్యంతగౌరవం చూపి, ఆయన మతబోధలకు కూడా తన రాజ్యంలో సంపూర్ణ స్వేచ్ఛను ఇచ్చాడు.

ముప్పదిసంవత్సరాలు బోధజేసి, జైనమతాన్ని ఒక స్థిరమైన మతంగా నిలబెట్టి, తన డెబ్బదిరెండవయేట, రాజగృహసమీపంలో నిపావా అనేగ్రామంలో మహావీరుడు నిర్వాణం చెందాడు. ఈనిర్వాణం క్రీస్తుశకానికిపూర్వం 468 సంవత్సరంలో అని చరిత్రకారుల ఊహ.

మహావీరుని అనంతరం, జైనమతంలో ఇక తీర్థంకరులు లేరు. ఆచార్యపురుషులే ఒకరితరువాతఒకరు పీఠాన్ని అధివసిస్తున్నారు.

### రెండుశాఖలు

క్రీస్తుకుపూర్వం నాల్గవశతాబ్దపు ఆఖరి రోజులలో మగధదేశంలో ఘోరమైన కాటకంవచ్చింది. ఆరోజులలో మగధదేశంనుంచి ప్రజలు విస్తారంగా దక్షిణదేశానికి, (మై

సూరు రాజ్యంవరకూ) వలసపోయారు. ఇలా వలసపోయిన వారిలో జైనమతస్థులుకూడా చాలామంది వున్నారు. వారికి ఆచార్యుడు భద్రబాహు. ఆయనే, జైనమతపు ఇరవైనాలుగుమంది తీర్థంకరుల చరిత్రను 'కల్పసూత్ర' అనేపేరుతో గ్రంథంగా రచించాడు. భద్రబాహు తనతోవలసవచ్చేవారిని వెంటబొట్టుకొని, కర్ణాట దేశానికి వచ్చాడు. పన్నెండుసంవత్సరాల అనంతరం, మగధలో కాటకంతగ్గి పోగా భద్రబాహు తిరిగి మగధ దేశానికి వచ్చాడు. కాని, ఆయనతో వలసపోయిన వారంతా తిరిగిరాలేదు. దక్షిణదేశంలోనే అనుకైనచోట్లలో వారుస్థిరనివాసం ఏర్పరచుకున్నారు.

ఆరోజులలోనే జైనమతంలో రెండుశాఖలు ఏర్పడినవి. మహావీరుడుచెప్పినప్రకారం, జైనులు దిగంబరులుగానే వుండాలనిభద్రబాహు పట్టుపట్టాడు. కాటకపురోజులలో వలసపోకుండా మగధదేశంలోనే వుండిపోయిన జైనులకు ఆచార్యుడుగావున్న స్థూలబాహు, దిగంబరత్వానికి అంగీకరించలేదు. జైనులు ఒక తెల్లనివస్త్రాన్ని ధరించవచ్చు నన్నాడు.

అప్పటినుంచీ భద్రబాహు అనుచరులకు దిగంబర జైనులనీ, స్థూలబాహు అనుచరులకు శ్వేతాంబరజైనులనీ పేరువచ్చింది. జైనులలో రెండుశాఖలు ఏర్పడినవి. ఈనాడు; జైనదేవాలయాలలో దీక్షాపరులై జీవితంగడిపే సన్యాసులు ఏకొద్దిమందోతప్ప, దిగంబరవ్రతాన్ని జైనులలో ఎవరూ అవలంబించరు. కాని, దిగంబరజైనులనీ, శ్వేతాంబరజైనులనీ రెండుశాఖలుమాత్రం యీనాటికీ స్థిరపడిపోయినవి.

ఈ నాడు సౌరాష్ట్ర, రాజస్థాన్ ప్రాంతాలలో నివసి

స్తున్నవారు శ్వేతాంబర శాఖకు చెందినవారు. కర్నాటక ప్రాంతంలో నివసిస్తున్నవారు దిగంబర శాఖకు చెందిన వారు.

జైనమత ప్రాబల్యంలో ఒకవిశేషం ఏమిటంటే, తనజన్మస్థానమైన మగధలో యీ మతానికి చెప్పదగినప్రచారమే యీనాడు లేదు. బౌద్ధమతం తనజన్మదేశంలోనే యీనాడు విశేషప్రచారం లేకుండా విదేశాలలో విశేషప్రాబల్యాన్ని పొందివుంటే, జైనమతం జన్మదేశపు తీరాన్ని వదలి వెళ్లలేదు. ఈనాడు భారతదేశంలో బౌద్ధులసంఖ్య సుమారు రెండులక్షలే అయితే, జైనులసంఖ్య పదహారులక్షలపైగా.

కాలక్రమేణ దిగంబర శ్వేతాంబరశాఖల జైనుల ఆచారభేధాలు విశేషంగా స్థిరపడినా, మతంలో మాత్రం మార్పులు ఏమీ లేవు.

జైనసిద్ధాంతంప్రకారం, ప్రపంచానికి నాశనంలేదు. జీవులపరస్పరసంఘర్షణవల్లనూ, ఆకాశం, ధర్మం, అధర్మం, కాలం, పుద్గల అనే అజీవభూతాల సంఘర్షణవల్లనూ ప్రపంచం నడుస్తున్నది. ప్రాణరహితమైనదేదీ లోకంలో లేదు. వృక్షములు, శిలలు, జలము, మొదలైనవన్నీ కూడా ప్రాణులే. ప్రాణులు కర్మఫలాన్ని అనుసరించి పునర్జన్మ ఎత్తుతూ వుంటాయి. కర్మరహితంగా జీవించడం ప్రాణికి దుస్సాధ్యం కనుక, జన్మరాహిత్యం అనేది ప్రాణికి సాధారణంగా వుండదు. కర్మను సంపూర్ణంగా విసర్జించి, జీవితాన్ని బంధరహితం చేసుకొని తపోనిష్ఠద్వారా, పునరావృత్తిలేని శాశ్వత మోక్షాన్ని ఆత్మ పొందగలదు. అంతేగాని, ప్రాణికి ముక్తిని

ప్రసాదించే దేవుడుగాని, కర్మబంధాన్నుంచి ప్రాణిని కాపాడే దేవుడుగాని లేడు.

## జీవహింసా నిషేధం

జీవహింసనిషేధం విషయంలో జైనమతం కఠినమైన నియమాలను పెట్టింది. కఠోరదీక్షతో పరిపూర్ణ నిర్వాణాన్నికోరే జైనసన్యాసులే కాక, జైనమతబోధలను అంగీకరించి చేతనైనంతవరకు కర్మవిసర్జనచేస్తూ ఉత్తమమైన పునర్జన్మాన్నికోరే జైనసంసారులకుకూడా ఈ నియమం చాలాముఖ్యం. అందువల్లనే జైనమతావలంబులైన సంసారు లెవరూ వ్యవసాయాన్ని వృత్తిగాపెట్టుకోరు. భూమినిదున్నే టప్పుడు నాగటిచాలులోపడి ఎన్నోకీటకాలు చచ్చిపోతాయి. అది పాపహేతువు. జైనమతస్థులంతా వర్తకవృత్తిని అవలంబించడానికి కారణం ఇదే.

జైనమతస్థులకూ బ్రాహ్మణులకూ బద్ధవైరం వుండేది. కల్పసూత్రం ప్రకారం, జైనతీర్థంకరులు క్షత్రియ కుటుంబంలో తప్ప మరొకకుటుంబంలో పుట్టరు. మహావీరుని జననాన్నిగురించి కల్పసూత్రం యీవిధంగా చెపుతుంది.

తీర్థంకరుడుగా భూలోకంలో జన్మించడానికి మహావీరుడు, పుష్పోత్తర అనే స్వర్గధామంనుంచి దిగాడు. కుంద గ్రామంలోని ఋషభదత్తుడనే బ్రాహ్మణునిభార్య దేవానంద. మహావీరుడు భూలోకంలో జన్మకోసం దేవానంద గర్భంలో ప్రవేశించాడు. కాని, తీర్థంకరుడు బ్రాహ్మణ వంశంలో పుట్టడంఅనేది అంతకు పూర్వం ఎప్పుడూ జరగ లేదు. అందువల్ల దేవానందగర్భంలోని శిశువును ఇంద్రుడు

త్రిశాలగర్భంలోకి మార్పించాడు. ఇది కల్పసూత్రంలోని గాధ. ఈగాధను పరమసత్యంగా శ్వేతాంబరులు విశ్వసిస్తారు. దిగంబరులు నమ్మరు. కాని, ఈగాధనుబట్టి, బ్రాహ్మణులంటే జైనులకు కిట్టదు అనేమాటమాత్రం స్ఫురిస్తున్నది. బ్రాహ్మణులు జైనులంటే బద్ధవైరంపూనిన మాటకూడా పూర్తిగా నిజమే.

మహావీరుని అనంతరం చాలాకాలంవరకు జైనమతస్థులు దేవాలయాలు, పూజలు, అర్చనలు మొదలైనకలాపాన్ని పెట్టుకోలేదు. కొంతకాలంతరువాత జైనసన్యాసులు నివసించే ఆరామాలనిర్మాణం, అక్కడ స్తూపనిర్మాణం జరిగింది. మరికొంతకాలానికి, గొప్పగొప్ప జైనదేవాలయాల నిర్మాణం ప్రారంభమైంది. జైనతీర్థంకరులంతా క్షత్రియులే కావడంవల్ల, జైనమతావలంబులుకాని రాజులుకూడా జైనసన్యాసుల ఆరామాలకూ, దేవాలయాలకూ విశేషంగా విరాళాలిచ్చేవారు. జైనమతస్థులైన సంసారుల వృత్తి వ్యాపారంకావడంవల్లనూ వారంతా విశేషంగా ధనికులు కావడంవల్లనూ, జైనదేవాలయాల నిర్మాణానికి అపారమైన సంపదలభించింది. అతిసున్నితమైన శిల్పవిన్యాసములుగల గొప్పగొప్ప జైనదేవాలయాలు సౌరాష్ట్ర, రాజస్తాన్ ప్రాంతములలో నిర్మింపబడినవి. ఆబుపర్వతంమీది జైనదేవాలయాలు యీనాటికీ అద్భుతమైన నిర్మాణములుగా పరిగణించబడుతున్నవి,

దేవుడు లేడనీ, మానవుడు తనముక్తికి మార్గాన్ని తానే చూసుకోవాలనీ యీనాటికీ జైనులు విశ్వసిస్తూవున్న

ప్పటికీ తక్కిన అన్ని మతాల వారివలెనే దేవాలయాలు కట్టుకొని, తీర్థంకరుల విగ్రహాలను ఆరాధించడం క్రీస్తుశక ప్రారంభంలోనే ఆరంభించారు. కొంతకాలంతరువాత తీర్థం కరుల విగ్రహాలకు పూజలు, అర్చనలు చేయడంకూడా సాంప్రదాయం అయింది.

జైనులమతగ్రంథాలలో ముఖ్యమైనదీ, మొట్ట మొదట వ్రాయబడినదీ 'ఆచారాంగసూత్ర.' ఈగ్రంథం, భద్రబాహుఅనంతరం, స్థూలభద్రునికాలంలో క్రోడీకరించ బడింది. ఈగ్రంథంఅంతా 'అంగ' ములనే అధ్యాయములుగా విభజించబడివుంది. ఇవి భద్రబాహుకుమాత్రమే కంఠస్థము. భద్రబాహు కర్ణాటదేశంనుంచి తిరిగి మగధకువచ్చినతరు వాత కొంతకాలంమాత్రమే మగధలోవుండి, నేపాల్‌కు వెళ్ళిపోయాడు. ఆచార్యోక్తములైన 'అంగ' ములను గ్రంథస్థంచెయ్యాలనే కోరికతో, స్థూలబాహు నేపాల్ వెళ్ళి, భద్రబాహువద్ద 'అంగ' ములను నేర్చుకున్నాడు. అసలు అంగములసంఖ్య పధ్నాలుగు. కాని, మొదటి పదిఅంగము లను మాత్రమే ఇతరులకు బోధించవచ్చునని భద్రబాహు ఆజ్ఞ.

నేపాల్‌నుంచి తిరిగివచ్చి, స్థూలబాహు జైనపండిత పరిషత్తును ఏర్పాటుచేసి, భద్రబాహుచెప్పిన పూర్వాం గములను గ్రంథస్థం చేయించాడు. కొంతకాలంతరువాత యీ 'అంగ' ములకు ఉపాంగములనే కొత్తభాగములు చేర్చబడినవి. ఏమయినా, 'ఆచారంగసూత్రం' అనేపేరుతో నేడుకనపడుతున్న గ్రంథం, ప్రారంభకాలంలో జైనాచా

ర్యాలు కంఠస్థంచేసుకున్న గ్రంథంకాదు. 'ఆచారాంగ సూత్ర' ను శ్వేతాంబరజైనులు ప్రమాణంగా అంగీకరిస్తారు, కాని దిగంబరజైనులు అంగీకరించరు. నిజమైన 'అంగ సూత్రాలు,' ఏనాడో స్మృతిపథంనుంచి తప్పిపోయినవనీ, యీనాడు శ్వేతాంబరులు సిద్ధాంతంగా అంగీకరించే గ్రంథం అసలుగ్రంథంరూపే మరపుకువచ్చినతరువాత, తయారుచేయ బడినదనీ దిగంబరజైనుల వాదం.

భద్రబాహు రచించిన 'కల్పసూత్ర' ను మత గ్రంథంగా జైనులు పరిగణించినప్పటికీ, అది బౌద్ధులజాతక కథలవలెనే జైనతీర్థంకరుల జీవితగాథ.

గ్రంథరచన, రచనలకు వ్రాతప్రతులను తయారు చేయడం పుణ్యకార్యములుగా జైనులు భావించేవారు. అందువల్ల, జైనసన్యాసులు అనేకగ్రంథాలకు వ్రాతప్రతు లను తయారుచేశేవారు. ఈగ్రంథాలు కేవలం మతగ్రంథాలే కాదు. కవిత్వం, జ్యోతిషం, వైద్యం, వేదాంతం, తర్కం మొదలైనవి. మరెక్కడా దొరకని అమూల్యగ్రంథాల ప్రతులెన్నో జైనదేవాలయాలలో నేటికీ అముద్రితములుగా వున్నాయి.

బౌద్ధులగ్రంథాలు మొదట్లో పాలిభాషలోను, మహా యానశాఖ ఏర్పడినతరువాత సంస్కృతంలోనూ వ్రాయ బడితే, జైనులమొదటిగ్రంథాలు సంస్కృతంలోనే వ్రాయ బడినవి. తరువాత చాలాకాలానికి ప్రాకృతంలో కూడా వ్రాయబడినవి.

అనేకగ్రంథాల మూలప్రతులు యీనాడు కానరాక

పోయినప్పటికీ, జైనులు తయారుచేసిన ప్రతులు జైనమంది రాలలో భద్రంగా వుండటంవల్ల, పేరే లేకుండా పోవలసిన అనేక గ్రంథాలు మనకు దక్కినవి. ఈవిధంగా జైనులు భారత దేశానికి చేసిన సేవ అమూల్యమైనది.

దేవుడు లేడని చెప్పినా, పారలౌకిక జీవితాన్ని అంగీక రించకపోయినా, ఇహలోకంలో జైనులు అనుసరించడానికి వారిమతం చెప్పిన నియమాలు ఏమతస్థులకైనా శ్రేయాలే.

# ఇస్లాం మతం

ఇస్లాం అంటే 'శరణం' అని అర్థం. సంపూర్ణంగా దేవునిశరణుపొందటం అనిభావం.

ఇస్లాం అనేపదానికి మరొకఅర్థంకూడా వుంది. 'శాంతి పొందుట.' ఎంతమంది దేవుళ్లు వున్నారు? ఏ దేవుడు అందరికంటె ముఖ్యుడు; ఏ దేవుని పూజించాలి అనే మానసిక అస్థిమితత్వాన్ని పారద్రోలి, మనస్సుకు శాంతిని ప్రసాదించేది, ఇస్లాం.

ఇస్లాం మత ప్రధానసూత్రం ఇది: "లా ఇలాహా ఇల్లాల్లా, మహమ్మద్ ఉర్ రసూల్ అల్లా." అల్లాతప్ప వేరే దేవుడు లేడు. అల్లా ప్రవక్త మహమ్మద్.

ఇస్లాంమతాన్ని అనుసరించేవారు ముస్లిములు. వీరికే మహమ్మదీయులు అనికూడా పేరు. (మహమ్మద్ ప్రవక్త బోధనలను అనుసరించేవారు కనుక.)

ఇస్లాంమత ప్రవక్త మహమ్మద్. ఆయన అరేబియాలోని మక్కా-పట్టణంలో క్రీ. శ. 570 సంవత్సరంలో ఒక గౌరవనీయమైన కుటుంబంలో జన్మించాడు. అరబ్బులు సెమెటిక్ జాతివారు. వీరిమూలపురుషుడు అబ్రహాం కుమారుడు ఇస్మాయెల్.

ఇస్మాయెల్ బాలుడుగావుండగా, అతనినీ, అతనితల్లి హాగార్‌నూ, అబ్రహాం ఇంటినుంచి వెళ్ళగొడతాడు. దీనికి కారణం, అబ్రహాం మొదటిభార్య శారా, ఆమె హాగార్‌నూ,

ఇస్మాయెల్‌నూ చూసి అసూయపడి వారిద్దరినీ వెళ్ళగొట్ట మని అబ్రహాంను బలవంతపెడుతుంది.

కొడుకును తీసుకొని హాగార్, అరేబియాప్రాంతం వెడుతుంది. అది ఎడారిప్రాంతం అక్కడ ఒక నీటిబుగ్గవద్ద ఆమె నివసిస్తుంది. ఆనీటిబుగ్గ సమీపంలో ఒకచాలాపెద్ద నల్లరాతిబండ వుంటుంది. ఇది ఉల్కాపాతం. ఆకాశంనుంచి పడినదికనుక, దానిని పవిత్రంగాభావించి అచ్చటిప్రజలు పూజించేవారు. ఆప్రాంతంలో ఇస్మాయెల్‌సంతతివారు విస్తారంగాప్రబలి, పెద్దపట్టణాన్ని కట్టుకున్నారు. ఆపట్టణంపేరు మక్కా.

మక్కాలోని నల్లరాతికి కాబా అనిపేరు. అచ్చటి నీటిబుగ్గకు జెంజెం అనిపేరు. ఈరెండూకూడా అరబ్బులకు చాలాపవిత్రమైనవి. ఆనల్లరాయిని మానవజాతికి మూల పురుషుడైన ఆదం స్వర్గవనంనుంచి తెచ్చి, తనసంతతివారికి ఇచ్చాడనీ, ఆదం సంతతివాడైన అబ్రహాం దానిని ఇస్మాయెల్‌కు ఇచ్చాడనీ అరబ్బులవిశ్వాసం. అచ్చటినీటిబుగ్గ, ఇస్మాయెల్ సృష్టించినదని వారినమ్మకం. నల్లరాతిచుట్టూ గొప్పదేవాలయాన్నికట్టి, వారు ఆనల్లరాతిని అర్చించేవారు. అంతేకాదు; అరబ్బులలెక్క ప్రకారం సంవత్సరానికి 360 రోజులు. రోజుకు ఒకఅధిదేవతచొప్పున, 360 రోజులకు 360 దేవతలను నిర్ణయించుకొని, 360 దేవతలకు విగ్రహాలను తయారుచేసి, ఆదేవాలయంలో స్థాపించి రోజుకొక దేవతను అర్చించేవారు.

మక్కా ఒకపెద్దపట్టణం అయింది. వ్యాపారానికి ఒక

పెద్దకూడలి అయింది. వ్యాపారానికివచ్చేవారూ, కాబా దేవాలయంలో మ్రొక్కుబడులు చెల్లించుకోడానికివచ్చే వారూ, ప్రతిరోజూ అనేకమందిఅరబ్బులు చుట్టుప్రక్కల గ్రామాలనుంచీ, పట్టణాలనుంచీ, మక్కాకు వచ్చి పోతూ వుండేవారు. విలాసాలకు డబ్బుఖర్చుపెట్టి పోయేవారు. అందు వల్ల మక్కాలో జూదశాలలు, వ్యభిచారగృహాలు, పాన శాలలు ఎక్కువ అయాయి. ప్రజలలో నీతినియమాలు తక్కువ అయాయి.

అలాంటికాలంలో, మహమ్మద్ మక్కాలో జన్మిం చాడు. కాని, ఆయనఆరవఏటనే తల్లిదండ్రులు మరణించి నందున, మక్కానుంచి తనపినతండ్రియింటికి వెళ్ళాడు. మహమ్మద్ పినతండ్రికి చాలాపశువులు వుండేవి. వాటిని మేతకుతోలుకొనిపోతూ, మహమ్మద్ కొంతకాలం గడిపాడు.

ఆరోజులలో అరేబియనులు సాంబ్రాణిమొదలైన సుగంధద్రవ్యాలను ఒంటెలమీద ఈజిప్టు, పెర్షియా దేశా లకు తీసుకొనివెళ్లి వ్యాపారంచేశేవారు. కొంతవయస్సు వచ్చినతరువాత మహమ్మద్ పశువులకాపరివృత్తిని వదలి, ఒంటెలబిడారులను నడపడానికి పూనుకున్నాడు. బిడారుల నాయకుడుగా ఆయన అనేకదేశాలనూ, పట్టణాలనూ చూశాడు. ఆయాప్రజల మతాలనూ, ఆచారాలనూ పరిశీ లించాడు.

వ్యాపారంలో, మహమ్మద్ అనేకసార్లు మక్కా వచ్చాడు. మక్కాలోని ఖదీజా అనే ఒకభాగ్యవంతురాలు, వితంతువు, తనఒంటెల బిడారుకు నాయకుడుగా మహమ్మ

ద్‌ను నియమించింది. అతడివ్యాపారదక్షత, సామర్థ్యం,
రూపం, యౌవనం, ఆమెను ఆకర్షించాయి. ఆమె మహమ్మ
ద్‌ను వివాహంచేసుకున్నది. అప్పుడు ఆమెకు నలభై సంవత్స
రాల వయస్సు; ముగ్గురుపిల్లలు వున్నారు. మహమ్మద్‌కు
ఇరవై నాలుగు ఏండ్లు. వీరిరువురికీ ఆరుగురుబిడ్డలు పుట్టారు.

ఖడీజాతో వివాహంవల్ల మహమ్మద్ భాగ్యవంతు
డయాడు; పెద్దవ్యాపారి అయాడు. మక్కాలోని పెద్దలలో
ఒకడయాడు. మంచిగౌరవం, పలుకుబడి సంపాదించాడు.

వ్యాపారంకోసం వివిధదేశాలలో తిరిగి, అచ్చటి
ప్రజల మతాచారాలను పరిశీలించినప్పటినుంచీ, మహమ్మ
ద్‌కు మతచింత ఎక్కువైంది. భగవంతునిగురించీ మతాన్ని
గురించి ఎక్కువగా ఆలోచించేవాడు.

మహమ్మద్ నలభయ్యవ సంవత్సరంలో ఆయనలో
ఒకగొప్పపరిణామం కలిగింది. ఒకనాడు ఆయన ఆలోచనా
మగ్నుడై వుండగా, దేవదూత గేబ్రియల్ ఆయనకు సాక్షా
త్కరించి, ఒకబంగారుపలకను చూపి, ఆపలకమీదవ్రాసిన
సందేశాన్ని చదవమని ఆదేశిస్తాడు. అంతవరకూ అక్షర
జ్ఞానంలేని మహమ్మద్, అల్లాకటాక్షంవల్ల చదవగలుగు
తాడు. మహమ్మద్‌కు దివ్యప్రబోధం కలుగుతుంది. ఇంటికి
వచ్చి, యీవిషయాన్నంతనూ ఆయన ఖడీజాకు చెపుతాడు.
ఆమె ఆయనను ప్రోత్సహిస్తుంది.

తరువాత ఎన్నోసార్లు, దేవదూత గేబ్రియల్ మహ
మ్మద్‌కు సాక్షాత్కరించి, అల్లాసందేశాలను బంగారుపలక
మీదవ్రాసి చూపుతాడు. ఈసందేశాలను మహమ్మద్ తన

ఆప్తులకు వినిపిస్తాడు. క్రమక్రమంగా ఆయనకు కొంత మంది అనుచరులు ఏర్పడుతారు. ఆయనకుటుంబంలోని వారంతా ఆయనబోధనలను స్వీకరిస్తారు.

దేవదూత గేబ్రియల్ బంగారుపలకమీాదవ్రాసిన సందేశాలనుపఠించి, మహమ్మద్ తనఅనుచరులకు వినిపించే వాడు. ఈసందేశాలే ఇస్లాంమతానికి పవిత్రగ్రంథమైన 'కురాన్' కు మూలం. కురాన్ అంటే 'పఠనం' అని అర్థం.

మొట్టమొదట మహమ్మద్‌కు శిష్యులుగా ఏర్పడిన వారి సంఖ్య 45. వారిలో ఆయనయింటిలోని బానిసలుకూడా కొందరు వున్నారు. వారిలోముఖ్యుడు బిలాల్ అనే ఇథియోపియన్. అతడికంఠం చాలా గంభీరంగా వుండేది. అందువల్ల ప్రార్థనవేళకు అందరినీపిలిచే మొట్టమొదటి ముఅజిన్‌గా అతడువుండేవాడు.

ప్రబోధం కలిగినతరువాత, మహమ్మద్ బోధించిన ధర్మం ఇది:

### ఇస్లాం ధర్మం

అల్లా ఒక్కడే దేవుడు. ఆయనప్రవక్త మహమ్మద్
విగ్రహారాధన కూడదు
దొంగతనం పనికిరాదు
అబద్ధం చెప్పకూడదు
ఇతరులను దూషించరాదు
మద్యపానం తప్పు

క్రమేపీ, మక్కాకువచ్చే యాత్రికులలో కొంతమందిని మహమ్మద్ ఇస్లాంమతంలోకి మార్చాడు. తరువాత,

యాత్రిబ్ పట్టణంలోని కొన్నికుటుంబాలవారు ఇస్లాం మతాన్ని స్వీకరించారు. ఈయాత్రిబ్ పట్టణానికే తరువాత, మదీనత్-ఉన్-నబి అనేపేరు వచ్చింది. అంటే ప్రవక్త పట్టణం అన్నమాట. క్లుప్తంగా ఆపేరే, మదీనా అయింది.

మహమ్మద్ బోధనలను, మక్కా పట్టణవాసులు మొదట్లో ఎక్కువగా పట్టించుకోలేదు. యాత్రిబ్ పట్టణం లోని కొన్నికుటుంబాలు ఇస్లాంమతాన్ని స్వీకరించగానే, మక్కాపట్టణవాసులలో కొంతసంచలనం కలిగింది. పైగా, విగ్రహారాధన కూడదు అనే మతాన్ని ప్రజలు ఎక్కువగా అవలంబిస్తే, మక్కా దేవాలయం ఆదాయం తగ్గిపోతుంది. అంచేత మహమ్మద్ ఇస్లాంమతాన్ని బోధించకుండా అరికట్టడానికి మక్కాపట్టణంలోని పెద్దలు కొంతప్రయత్నించారు. కాని, మహమ్మద్ పినతండ్రి అబు తలీబ్ కు మక్కాపట్టణంలో మంచి పలుకుబడి వుంది. అంచేత మహమ్మద్ ను ఏమిచెయ్యడానికీ, ఆయనవిరోధులకు ధైర్యం చాలలేదు. ఇస్లాం మతావలంబులను గేలిచెయ్యడం, బహిరంగంగా సభలుజరపుకోకుండా అల్లరిచెయ్యడం, ఇలాటిపనులు చేశేవారు, ఆవిరోధులు. అందువల్ల, ఇస్లాంమతస్థులు ఎవరియింటిలోనైనా సభలు జరుపుకోవలసి వచ్చింది. కాని ఓమర్ అనే ఒకయువకుడు ఇస్లాంను స్వీకరించడంతో మళ్ళీ వారికి కొంతధైర్యం వచ్చింది. అతడికి మక్కాలో చాలా పలుకుబడివుంది. ధైర్యశాలిఅనే ప్రతిష్ఠవుంది. అంచేత, అతడు ఇస్లాంను స్వీకరించినతరువాత, ముస్లిములు మళ్లీ బహిరంగంగా తమప్రార్థనలు చేసుకోగలిగారు. ఇస్లాంమత

వ్యాప్తికి ఓమర్ చేసినకృషి ఇంత అనిచెప్పడానికి వీలులేదు. అరేబియా దేశం అంతటా ఇస్లాంను వ్యాపింపజెయ్యడానికి మహమ్మద్‌కు విశేషంగా ప్రోద్బలంకలిగించినవ్యక్తి, ఓమర్.

క్రీ. శ. 619 సంవత్సరంలో మహమ్మద్ భార్య ఖడీజా, ఆయన పినతండ్రి అబు తలీబ్ మరణించారు. అబు తలీబ్ మరణంతో ఇస్లాంకు మక్కాలో ఒక పెద్దప్రాపకం పోయింది. అప్పటినుంచీ మక్కాలోని అధికారులు ముస్లిములను పీడించడం ప్రారంభించారు. బహిరంగంగా ప్రార్థనలు జరుపరాదనీ, మతబోధలుచెయ్యరాదనీ ఆజ్ఞాపించారు.

యాత్రిబ్ లో ఇస్లాంమతావలంబులసంఖ్య నానాటికీ హెచ్చుతూవుంటే, మక్కాలోని అధికారుల ఆగ్రహంకూడా పెరగనారంభించింది. మహమ్మద్‌ను చంపడానికి వారు ప్రయత్నంచేశారు. ఈసమాచారం ముందుగానే తెలుసుకొని ఒకానొకరాత్రి మహమ్మద్ మక్కాపట్టణంవదలి, యాత్రిబ్‌కు వెళ్లిపోతాడు. ఆరాత్రికే హెజిరా అనిపేరు. ఆనాటినుంచే, ముస్లిముల శకారంభం. హెజిరాఅంటే పలాయనంచేసిన రాత్రి అనిఅర్థం. అప్పటికి మహమ్మద్‌కు 55 ఏండ్లు.

యాత్రిబ్‌కు మదీనత్ ఉన్‌నబి (మదీనా) అని పేరు వచ్చింది. ఆపట్టణంలో ఆరుసంవత్సరాలువుండి, ఇస్లాం మతాన్ని బాగా వ్యాప్తిలోకితెచ్చి, క్రీ. శ. 628 సంవత్సరంలో 1400 మందిఅనుచరులతో ఆయన మక్కాపట్టణంమీాద దాడిజరిపి, పట్టణంలో ప్రవేశించాడు. కాబాదేవా

లయంలోని 360 విగ్రహాలను పగలగొట్టాడు. అంతటితో మక్కా ఇస్లాంమతస్వీకారం చేసినట్లే.

మహమ్మద్ మతప్రవక్త అధికారంతోపాటు, రాజ్య పాలన అధికారంకూడా వహించాడు.

ఖదీజా మరణానంతరం, మహమ్మద్ తనఆప్త మిత్రుడూ, ముఖ్యశిష్యుడూ అయిన అబు బకర్ కుమార్తె ఆయేషాను పెండ్లి చేసుకున్నాడు.

మక్కాపట్టణాన్ని వశంచేసుకున్న తరువాతకూడా, మహమ్మద్ తనస్థిరనివాసాన్ని మదీనాపట్టణంలోనే ఏర్పాటు చేసుకున్నాడు. ఆయన మరణించినది మదీనాలోనే.

మతప్రచారంకోసం యుద్ధంచేసినా, మహమ్మద్ మానవులందరినీ సమానదృష్టితో చూశేవాడు. తనయింటి లోగాని, యుద్ధరంగంలోగాని, తనఅనుచరులందరితోటి సమానంగా పాటుపడేవాడు. కాని, ఇస్లాంమతాన్ని స్వీకరించనివారిమీద కత్తిదూసి, వారిచేత ఆమతాన్ని అవలంబింపచెయ్యడం ఒకధర్మం అని ఆయన భావించాడు.

ముస్లిములు అవలంబించవలసిన పవిత్రధర్మాలుగా మహమ్మద్ బోధించినవానిలో ముఖ్యమైనవి ఇవి :

అల్లాను, అల్లాప్రవక్త మహమ్మద్‌ను నమ్మాలి.
ప్రతిరోజూ అయిదుసార్లు ప్రార్థన చెయ్యాలి.
బీదలపట్ల దయచూపి, వారికి ధర్మం చెయ్యాలి.
రంజాన్ నెలలో ఉపవాసం చెయ్యాలి.
ప్రతిసంవత్సరమూ మక్కాకు యాత్ర చెయ్యాలి.

ముస్లిములందరూ సమానులు. వారిలో ఎక్కువ తక్కువలు లేవు.

ఎవరిచేతనైనా పనిచేయించుకుంటే, వారి చెమట ఆరకుండా వారికూలి యిచ్చెయ్యాలి.

ఇస్లాంమతం ఎక్కువగావ్యాపించడానికీ, యీనాటి గొప్పమతములలో ఒకటిగా నిలవడానికీ కారణం, ఆమతం మానవులందరూ సమానమని బోధించడమే.

## ఖలీఫాలు

తనతరువాత ముస్లిములకు మతపీఠాధికారిగాను, రాజ్యపాలకుడుగాను ఎవరువుండాలనే విషయాన్ని మహమ్మద్ తనమరణసమయంలో ఏమీ చెప్పలేదు.

మహమ్మద్ మరణానంతరం ఖలీఫాపదవికోసం తగాదా వచ్చింది. ఖలీఫాఅంటే 'వారసుడు' అనిఅర్థం. ప్రవక్త మహమ్మద్‌కు వారసుడుగా, ముస్లిములందరికీ మతాధిపతిగా వుండేవ్యక్తి ఖలీఫా అన్నమాట. ముస్లిమమతావలంబులైన రాజులందరూ, ఖలీఫాఆజ్ఞను శిరసావహించ వలసిందే.

మహమ్మద్ అల్లుడు ఆలి, మహమ్మద్ మామ అబుబకర్ ఖలీఫాపదవికి పోటీపడ్డారు. చివరకు అబుబకర్ గెలిచాడు. కాని, ఆయన రెండుసంవత్సరాలు మాత్రమే ఖలీఫాగా వున్నాడు. క్రీ. శ. 634 లో ఆయన చనిపోతూ, తన అనంతరం ఖలీఫాగా ఓమర్ ఇబిన్ ఖతబ్‌ను పేర్కొన్నాడు. ఓమర్ కాలంలో అరబ్బులు ఇరాక్, పెర్షియా, ఈజిప్టులపై దండయాత్రజరిపి, విజయంపొందారు. ఈప్రాంతాలన్నిటిలోనూ ఇస్లాంమతం నెలకొన్నది.

కొత్తగా ఆక్రమించబడిన ప్రాంతాలలో ఇస్లాంమతం స్వీకరించడానికి ఇష్టంలేనివారు, ఏడాదికి కొంతపన్ను చెల్లించాలని ఓమర్ ఉత్తరువు చేశాడు. ఈవిధంగా జిజియా అనే తలపన్నును మొట్టమొదట ప్రవేశపెట్టినవాడు ఖలీఫా ఓమర్.

ఓమర్ పదేళ్లుమాత్రమే ఖలీఫాగా వున్నాడు. క్రీ.శ. 644 లో మదీనాలో ఆయన హత్యచేయబడ్డాడు. ఆయన తరువాత ఓత్‌మన్ ఖలీఫా అయాడు. క్రీ. శ. 656 లో ఆయనకూడా హత్యచేయబడ్డాడు. ఆయనతరువాత, మహమ్మద్ అల్లుడు ఆలి ఖలీఫా అయాడు.

అప్పటినుంచి ఖలీఫాపదవికి పోరాటాలు చాలా ఎక్కువఅయాయి. మదీనాలో కల్లోలాలవల్ల ఆలి, ఇరాక్‌కు పారిపోవడం జరిగింది. ఖలీఫాపదవికి మువియా పోరాటం సాగించాడు. ఆలిసైన్యాలకూ, మువియాసైన్యాలకు పోరాటం జరిగింది. పోరాటం ఇదమిత్థమని తేలకుండానే, ఆలి హత్యచేయబడ్డాడు. అంతేకాదు. ఆలికుమారుడు హుసేన్‌ను కర్బాలాలో దారుణంగా చంపడం జరిగింది.

ఆలిమరణానంతరం, ఖలీఫాపదవిని స్వీకరించవలసిన హుసేన్ అతనిప్రత్యర్థులతో పోరాటానికి వెడతాడు. మువియావారసుడైన యజిద్ అనుచరులు హుసేన్‌ను పట్టుకొంటారు. మొత్తం ముప్పది ముగ్గురు, హుసేన్‌ను తలొక కత్తిపోటుతో చంపి, శిరసును ఖండించి శిరస్సును కుఫానగరానికి తీసుకొనిపోతారు. హుసేన్ అన్న హసన్‌ను అతని భార్య మదీనాలో హత్యచేస్తుంది. కాని, ఆలివంశీకులకు

యీనాడుకూడా గొప్పగౌరవంవున్నది. ఆవంశీకులనే గురువులుగా భావించే ముస్లిములు షియా లని పిలువబడుతున్నారు. ముస్లిములలోవున్న రెండుపెద్ద తెగలలో షియాలు ఒకరు. రెండవతెగవారు సున్నీలు.

దేవునిప్రవక్తఅయిన మహమ్మద్ వంశీకులే ఖలీఫాలుగా వుండాలనీ, వారుచెప్పినదే ముస్లిములకు అనుల్లంఘనీయమైన ధర్మమనీ భావించేవారు షియాలు.

ప్రవక్తమహమ్మద్ మరణానంతరం, ఖలీఫాపదవికి అర్హుడైనవ్యక్తినైనా ముస్లిములు ఎన్నుకోవచ్చుననీ, ప్రజాభిప్రాయంప్రకారం ఎన్నుకోబడిన నాయకుడే ఖలీఫాగా వుండాలనీ విశ్వసించేవారు సున్నీలు.

ఇండియాలో షియా తెగ ముస్లిములసంఖ్య ఎక్కువ. హుసేన్ వధకు సంబంధించినగాధను మొహరంనెలలో జ్ఞప్తికి తెచ్చుకొని, పీర్లనుఊరేగించి దుఃఖాన్ని వెలిబుచ్చేవారు షియాలే.

ఈరెండు తెగలేకాదు. ఇస్లాంమతం అనేక దేశాలలో వ్యాపించినకొద్దీ, ఆయా దేశాల సాంప్రదాయాలనుబట్టి, ఇస్లాంమతంలో అనేక తెగలు ఏర్పడినవి. ఈనాడు ప్రపంచంలోని అన్ని దేశాలలోనూ, ముస్లిములలో నూరు తెగలకు పైగా వున్నవని అంచనా.

తెగలుఎన్నివున్నా, ఆచారాలలో మార్పులువున్నా, ప్రపంచంలోని ముస్లిములందరూ మహమ్మద్ బోధించిన మూలసూత్రాలనుమాత్రం సంపూర్ణంగా విశ్వసిస్తూనే వున్నారు.

ఖలీఫాపదవిని కొంతకాలం బాగ్దాద్ రాజులు, తరు వాత టర్కీ సుల్తానులు అనుభవించారు. టర్కీలో సుల్తానును పదభ్రష్టుణ్ణిచేసి, కెమాల్ పాషా ప్రజారాజ్యాన్ని నెలకొల్ప డంతో, ప్రస్తుతం ఖలీఫాపదవి లేదు.

## కురాన్

ముస్లిముల వేదం కురాన్. కురాన్ అంటే 'పఠనం,' లేక 'సమీకరణం' అనిఅర్థం. దేవదూత గేబ్రియల్ బంగారు పలకమీద వ్రాసిన ప్రబోధాలను పఠించి, మహమ్మద్ మత బోధచేశాడు. కురాన్‌కు ప్రాతిపదిక ఆ 'పఠనం' అయిన ప్పటికీ, మహమ్మద్ తనబోధనలలో చెప్పిన నియమాలు, నీతులు అన్నీ చేర్చి, గ్రంథరూపంగా కురాన్ సమీకరించ బడినది.

కురాన్‌లో 114 అధ్యాయాలు వున్నాయి. అధ్యా యానికి 'సురా' అని పేరు. కురాన్‌లోని అన్ని అధ్యాయాలు మహమ్మద్ అప్పుడప్పుడు ప్రవచిస్తూవచ్చిన బోధలు. ఈ మొత్తం ప్రవచనాలు, 23 సంవత్సరాల కాలంలో చెప్ప బడినవి. మహమ్మద్ జీవితకాలంలో కురాన్ గ్రంథరూ పంలో లిఖితం కాలేదు. ఆయనఅనుచరులు, ఆయనప్రవచ నాలను కంఠస్థం చేసుకొనేవారు. మహమ్మద్ మరణానం తరం, అబుబకర్ ఖలీఫాగా వుండగా కురాన్ గ్రంథరూ పంలో లిఖించబడింది.

ఇస్లాంమతబోధలన్నిటికీ మూలాధారం కురాన్. మతవిషయమైన చర్చలన్నిటిలోనూ, కురాన్‌లో చెప్పినదే తుదినిర్ణయం.

దేవుని ప్రార్థించడం, దేవునికీ మానవునికీగల సంబంధాన్ని వివరించడం మాత్రమే కాక, ఇస్లాం మతావలంబులు అవలంబించవలసిన ఆచారాలు, అనుసరించవలసిన ధర్మాలు, నిత్యజీవితంలో పాటించవలసిన నియమాలు, సంసారనిర్వహణలోవిధులు, సమస్తమూ కురాన్‌లో వున్నాయి.

కురాన్ ప్రవచనప్రకారం, భూలోకంలో మరణించినంతమాత్రాన మానవునిజీవితం అంతమొందదు. ఈలోకంలో మరణంఅంటే, ఇంకొకలోకంలో జీవితం ప్రారంభించడ మన్నమాట. ఈలోకంలో మానవునిజీవితం కారణరహితంకాదు. మరొకలోకంలో ఉన్నతజీవితానికి తగురీతిగా ప్రవర్తించడమే, యీలోకంలో జీవితపు ఆదర్శం.

ఈలోకంలో జీవితం చాలించినవారు మంచివారైతే స్వర్గానికీ, దుష్టులైతే నరకానికీ పోతారు.

యూదుజాతి ప్రవక్తలైన అబ్రహాం, మోసెస్‌లనూ, జీసస్‌నూ, మానవులకు ధర్మబోధచేసే ప్రవక్తలుగా కురాన్ పేర్కొంటుంది. కాని, మహమ్మద్ తరువాత ఇకప్రవక్త లేడు అని చెప్తుతుంది. మానవులకు శాశ్వతధర్మాలను బోధించిన ఆఖరిప్రవక్త, మహమ్మద్. ఆయనతరువాత ఇక ప్రవక్త వుండడు గనుక, ఆయననుమించిన ప్రవక్తలేడు.

మహమ్మద్ తన బోధనలలో తననుగురించి ప్రత్యేకంగా స్పష్టపరచి తనఅనుచరులకు చెప్పినవిషయం ఇది: తాను దేవుడు కాడు; దేవుని అవతారం కాడు; దేవాంశసంభూతుడు కాడు; దేవుని బిడ్డ కాడు; మానవులలో మాన

చమాత్రుడుగా పుట్టి, దైవప్రబోధంవల్ల మానవులకు శాస్త్ర బోధ చేస్తున్న ప్రవక్త.

దేవుడు తనఆదేశాలను మహమ్మద్‌కు దేవదూత ద్వారా తెలియపరచాడు, దేవుడు మానవులకు కనపడడు. తన దూతలద్వారా ప్రపంచంలోని మానవులకు సందేశాలను పంపుతాడు.

మానవునికి కనపడని దేవునికి, మానవుడు రూపం కల్పించరాదని మహమ్మద్ ప్రవచనం. ఈకారణంవల్లనే, ముస్లిములు తమమసీదులలోగాని, భవనాలలోగాని, దేవుని రూపాలుగా భావించే చిత్రాలను వెయ్యరు. దేవునిచిత్రాలనే వెయ్యనప్పుడు, దేవునిసృష్టి అయిన మనుష్యుల చిత్రాలనుగాని, జంతువులచిత్రాలనుగాని అసలు వెయ్యకూడదు. అందువల్లనే ముస్లింశిల్పంలోగాని, చిత్రలేఖనలోగాని మానవ, జంతు రూపాలకల్పన కనపడదు.

ఏకదేవత్వం, సర్వమానవసమానత్వం ప్రధానధర్మాలుగా ఆరంభించినఇస్లాంమతం, ఒకసామ్రాజ్యమతంఅయింది. మహమ్మద్‌కు వారసులైన ఖలీఫాలు, మతప్రచారానికి రాజ్యాలను జయించడం, జయించినరాజ్యాలను నిలబెట్టుకోడానికి బలవంతంగా ప్రజలను ఇస్లాంమతంలోకి చేర్పించడం జరిగింది. విగ్రహారాధనను ఎంతమాత్రం సహించని ఇస్లాం మతం వ్యాపించినకొద్దీ, అనేకదేశాలలోని దేవాలయాలు, దేవతావిగ్రహాలు ధ్వంసంచేయబడినవి.

అయితే అరబ్బులూ, పెర్షియనులూ భవననిర్మాణం పట్ల అత్యంత అభిమానంకలవారు. కాబట్టి ముస్లిములప్రార్థ

నలకు మసీదులను, చనిపోయిన మతగురువులకు, రాజులకు బ్రహ్మాండమైన గోరీలను విశేషంగా నిర్మించారు. ఇవన్నీ కూడా ఎక్కువగా పారశీక శిల్పపద్ధతిలో నిర్మింపబడినవి. ఈ నాడు అత్యంతసుందరమందిరాలుగా పరిగణింపబడే ఎన్నో నిర్మాణాలు, యీశిల్పానికి చెందినవే.

ఇస్లాంమతం మహత్తరమైనశక్తితో విజృంభించక పోతే, క్రైస్తవమతం ఈనాడు ప్రపంచమంతా వ్యాపించి వుండేదనిచాలామంది చరిత్రకారుల అభిప్రాయం.

# శిక్కు మతం

ఉత్తరదేశంలో హిందీమాట్లాడేవారు 'క్ష' అనే శబ్దాన్ని పలుకరు. క్షీర అనడానికి ఖీర్ అంటారు; లక్ష్మణ అనడానికి లఖ్మన్ అనిగాని, లఖన్ అనిగాని అంటారు. అజంతాలైనమాటలను ఆఖరిశబ్దం హ్రస్వమైనట్లయితే హలంతంగా ఉచ్చరిస్తారు. రామ అనడానికి రామ్, హర అనడానికి హర్ అంటారు.

అలాగే పంజాబీలు 'ష' అనేశబ్దం పలుకడానికి 'ఖ' అని పలుకుతారు. 'పురుష' అనడానికి పురుఖ్. శిష్య అనడానికి శిఖ్ అని ఉచ్చరిస్తారు.

శిఖ్ మతమే, మనవాడుకలో శిక్కుమతం అయింది. శిక్కులు అనే మాటకు సరియైనఅర్థం చెప్పాలంటే శిష్యులు అన్నమాట.

ఒకగురువుబోధించిన బోధలప్రకారం నడుచుకొనే శిష్యులు, శిక్కులు. శిక్కులకు మొదటిగురువు నానక్. ఆ మతాన్ని స్థాపించినది ఆయనే.

నానక్, లాహోర్ సమీపంలో తాల్వండి అనేగ్రామంలో క్రీ. శ. 1469 సంవత్సరంలో ఒక ఖత్రి (క్షత్రియ) కుటుంబంలో జన్మించాడు. ఈ తాల్వండిగ్రామానికి ఇప్పుడు నాంకానా అనిపేరు.

చిన్నతనంనుంచీ నానక్, దేవుడు మతం అనేవిషయాలనుగురించి ఆలోచిస్తూవుండేవాడు. ఆరోజులలో కబీర్

పాటలూ, ఆయనబోధించిన భక్తిమార్గమూ మంచివ్యాప్తిలో వుండేవి. విగ్రహారాధన కూడదు, దేవుడొక్కడే, ఆదేవుడే రాముడు అని కబీరుపాడిన పాటలను నానక్ బాగా మనస్సుకు పట్టించుకున్నాడు. అంతేకాదు. కబీరుకు గురువైన రామానందుని బోధలను కూడా నానక్ వివరంగా తెలుసుకున్నాడు. కులభేదాలూ, కర్మకాండలూ పోవాలని రామానందుడుచేసిన బోధలు నానక్ మనస్సుకు నచ్చినవి. ఈ విధంగా, రామానంద కబీరులు నానక్‌కు గురుతుల్యులైనారు. వారి బోధలను గురించి తర్కిస్తూ, వారిపాటలను పాడుతూ, వారిబోధలలో తానుచేయవలసిన మార్పులను గురించిఆలోచిస్తూ నానక్ కాలంగడిపేవాడు. ఇలావుండగానే ఆయనకు వివాహం అయింది.

నానక్ ముప్పదిఏండ్లవాడయ్యాడు. ఈలోపల ఆయన ఆలోచనలన్నీ ఒకరూపానికి వచ్చాయి. తానుబోధించవలసిన మతమేదో నిర్ణయించుకున్నాడు.

## కొత్తమతం

ఒకనాడు ఇంటికివచ్చి, తాను ఒకకొత్త మతాన్ని బోధించబోతున్నాననీ ఆమతానికి తానుగురువుననీ ప్రకటించాడు. ఇంట్లోవున్నవారంతా ఆశ్చర్యపడ్డారు. "ఏమిటీ ఆమతం?" అని అడిగారు.

ప్రపంచానికి ఒకేఒక దేవుడు వున్నాడు. ఆదేవుడు అల్లాకాదు; ఆదేవుడు రాముడుకాదు. మనుష్యులందరూ సమానులు. ముస్లిములనీ, హిందువులనీ వేర్వేరుపేర్లు వారికి

తగవు. బ్రాహ్మణులనీ, మరొకరనీ, కులభేదాలు వుండ కూడదు. విగ్రహారాధన తప్పు. కొంతమంది గురువులు మాంసంతినకూడదని తమఅనుచరులకు ఒకనిషేధం పెట్టారు. మాంసం తినవచ్చునని నేనుబోధిస్తాను. అయితే, మాంసం కోసం ఏదైనాజంతువును చంపేటప్పుడు ఒక్కవ్రేటుతో అది చచ్చిపోయేటట్టు నరకాలి. దేవుణ్ణి సేవించడానికి ప్రజ లకు ఒకగురువు వుండాలి. ఈమతానికి మొదటిగురువును నేనే.

ఇది నానక్ జవాబు.

నానక్ తనమతాన్ని ప్రజలకు బోధించడం మొదలు పెట్టాడు. ఉదయమూ, సాయంత్రమూ దేవునిప్రార్థించ డానికి స్తోత్రాలను బోధించాడు. ఈస్తోత్రాలనే 'జప్' అంటారు.

గీతగోవిందంరచించిన జయదేవుని పాటలనూ, రామా నందుని పాటలనూ, కబీర్ పాటలనూ, నామదేవుని పాట లనూ, నానక్ తనప్రార్థనసమయంలో పాడేవాడు. నానక్ సహచరుడు మోర్దనా అనే ముస్లిం చాలాశ్రావ్యంగా పాటలుపాడేవాడు. అంచేత, నానక్ ఎక్కడికివెళ్ళినా మోర్ద నాను వెంటబెట్టుకొనివెళ్ళి, అతనిచేత భక్తిగీతాలను పాడించి ఉపన్యాసాలిచ్చేవాడు.

మతబోధచెయ్యడానికి నానక్ హిందూదేశంఅంతటా మాత్రమే కాకుండా, సిలోన్, అరేబియా దేశాలలోకూడా సంచారం చేశాడు. అయితే అతడిస్వదేశమైన పంజాబ్‌లో మాత్రమే అతడికి ఎక్కువగా శిష్యులు చేరారు. ఈశిష్యులలో

హిందువులు, ముస్లిములుకూడా వున్నారు. హిందువులను, ముస్లిములను కలిపి, ఒకేమతం అనుసరించేటట్లు చెయ్యాలని నానక్ సంకల్పం.

నానక్ మతాన్ని అసంఖ్యాకంగా ప్రజలు అవలంబించకపోయినా, అతనిబోధలపట్ల ప్రజలు సుముఖులుగా వుండేవారు. హిందువులు, ముస్లిములు కూడా నానక్‌ను చాలా గౌరవించేవారు.

"గురు నానక్ షా ఫకీర్
హిందూకా గురు, ముసల్మాన్‌కా పీర్"

గురునానక్ ఫకీర్లకు రాజు; హిందువులకు గురువు, ముస్లిములకుపీర్ అని ఆయననుగురించి చెప్పేవారు.

నానక్ సనాతనఛాందసాలను ఖండించేవాడు. విగ్రహారాధనను నిరసించాడు. ఒకసారి ఆయన కాశీ వెళ్లాడు. అక్కడ గంగలో మోకాళ్లవరకూదిగి, ఉదయిస్తున్న సూర్యునికి అర్ఘ్యంఅర్పిస్తున్న బ్రాహ్మణులను చూశాడు. తాను కూడా గంగలోకిదిగి, పడమటివైపు తిరిగి, గంగాజలాన్ని విసరడం ఆరంభించాడు. సూర్యుడు తూర్పునవుంటే పడమటవైపు జలాన్ని విసరుతున్నావేమయ్యా' అని ఆయనను ఒకరు ప్రశ్నించారు. 'పంజాబ్‌లో నాకు పొలంవుంది. ఆపొలం నీరులేక బీడు అవుతున్నది. అంచేత, యీ గంగాజలాన్ని నా పొలంమీదకు విసరుతున్నాను', అని నానక్ జవాబు చెప్పాడు.

ఆమాట విన్నవారంతా నవ్వారు. 'ఓమనిషీ, ఇక్కడ

నుంచి పంజాబ్‌లో సీపొలందాకా నీళ్లను ఎలావిసరగల వయ్యా' అని ఎక్కసెక్కంచేశారు.

''ఆకాశంలోవున్న సూర్యునికి మీరుఅర్పించిన నీళ్లు అందినట్లయితే, నేనువిసిరిన నీళ్లు నాపొలందాకా వెళ్లవా?' అని నానక్ అడిగాడు. అందరూ తెల్లపోయి, ఒకరిమొహం ఒకరు చూచుకున్నారు.

ముస్లిములు ఎక్కడవున్నా, మక్కాపట్టణంవైపు కాళ్లుపెట్టి పడుకోరు. ఒకరోజు నానక్ నిద్రపోతూవుండగా, ఆయన శిష్యుడొకడు వచ్చి, ఆయనను చూచాడు. వెంటనే ఆయనను లేపి, 'గురూ, మీరు దేవునిపట్టణంవైపు కాళ్లుపెట్టి పడుకున్నారు' అని చెప్పాడు. 'అలాగా! అయితే, దేవుడు లేనివైపు నాకాళ్లుపెట్టి పడుకుంటాను. కాని, దేవుడు ఏ దిక్కునలేడో చెప్పు' అని నానక్ తనశిష్యుని అడిగాడు. శిష్యుడికి ఏమీతోచక బైటికి వెళ్లాడు.

ఈ కథలనుబట్టి, నానక్ అర్థంలేని ఆచారాలను నిరసించేవాడని స్పష్టమవుతున్నది.

దేవుని ప్రార్థించడానికి కావలసినది నిర్మలమైన మనస్సు. అంతేగాని, సన్యాసం తీసుకోవడం, కాషాయ వస్త్రాలు ధరించడం, విభూతి పూసుకోవడం, ఆలయాలలో విగ్రహాలకు అర్చనలు, కానుకలు అర్పించడం కాదని నానక్ బోధించాడు.

## గురు పరంపర

నానక్ తరువాత తొమ్మిదిమంది గురువులు శిక్కు మతాన్ని బోధించారు.

రెండవగురువు, అంగద్. ఈనాడు శిక్కులు వ్రాసే గురుముఖిలిపిని ప్రవేశపెట్టినది అయనే. నానక్ బోధలను, పాటలను మొట్టమొదట గ్రంథస్థం చేసిందికూడా ఆయనే.

అంగద్ తరువాత అమర్‌దాస్, ఆ తరువాత రామ్‌దాస్ గురువులయారు. రామ్‌దాస్ కాలంనాటికి శిక్కుల సంఖ్య బాగా పెరిగింది. ఆయనకు చాలా గొప్పసాధువు అని పేరు. రాజులు, చక్రవర్తి కూడా ఆయనను గౌరవించారు. శిక్కులకు ఒకఆలయాన్ని కట్టుకోడానికి లాహోర్‌కుతూర్పున 32 మైళ్లదూరంలో విశాలమైన స్థలాన్ని అక్బర్‌చక్రవర్తి, గురురామ్‌దాస్‌కు ఇచ్చాడు. ఆ స్థలంలో క్రీ. శ. 1577 సంవత్సరంలో ఒక దేవాలయాన్ని గురురామ్‌దాస్ కట్టించాడు. తరువాత శిక్కులు ప్రబలులై రాజ్యాలను సంపాదించినతరువాత, ఈ దేవాలయంగోపురానికి రాగిరేకులుకప్పించి, ఆ రేకులమీద బంగారు పూత పూయించారు. అంచేతనే ఆ దేవాలయాన్ని బంగారుదేవాలయం అంటారు. గురురామ్‌దాస్ కాలంనుంచి, ఇప్పటికీ ఆ ఆలయం శిక్కులకు అతిపవిత్రమైనది. ఆ ఆలయసమీపంలోవున్న ఒక చిన్న సరస్సును, రామ్‌దాస్ పెద్దదాన్నిగాత్రవ్వించాడు. దానికిఅమృతసరస్సు అని పేరు. ఆ సరస్సుకూ, ఆలయానికీ చుట్టూ పెరిగిన పెద్ద పట్టణానికి అమృతసర్ అని పేరువచ్చింది.

రామ్‌దాస్ తన తరువాత శిక్కులగురువుగా తన మూడవకుమారుడు అర్జున్‌ను నియమించాడు. శిక్కులకు అతిపవిత్రమైన మతగ్రంథం, గ్రంథ్‌సాహెబ్. ఈగ్రంథాన్ని కూర్చినది, గురుఅర్జున్. జయదేవ, రామానంద, నామదేవ,

కబీర్, సుఫీ ఫరీదుద్దీన్ షాకర్‌గంజ్, నానక్‌ల భక్తి గీతాలు, నానక్ బోధలు, శిష్యులకు నానక్ చెప్పిన ప్రార్థన మంత్రాలు, గ్రంథ్ సాహెబ్‌లో కూర్చబడినవి. ఈగ్రంథాన్ని శిక్కులు 'ఆదిగ్రంథ్' అనికూడా అంటారు.

గురుఅర్జున్ కాలంలో శిక్కుమతం మరింత వ్యాపించింది. జహాంగీర్ చక్రవర్తికుమారుడు ఖుస్రూ తండ్రికి ఎదురు తిరిగినప్పుడు, ఖుస్రూకు గురుఅర్జున్ సహాయంచేశాడనే ఆరోపణతో, జహాంగీర్ గురుఅర్జున్‌ను జెయిలులో పెట్టించాడు. జెయిలులో నానాహింసలు పెట్టించి, చివరకు లాహోరులో గురుఅర్జున్‌ను పురితీయించాడు.

శిక్కుమతబోధపట్ల ముస్లింపాలకులు విరోధంపూనిన సంగతిని అర్జున్ గ్రహించాడు. అంచేత, శిష్యులందరినీ ఆయుధహస్తులనుచేసి, అప్రమత్తతతో మెలగవలసిందని తనపుత్రుడు హర్‌గోవింద్‌కు చెప్పాడు.

అర్జున్ తరువాత శిక్కులకుగురువైన హర్‌గోవింద్ సైన్యాన్ని తయారుచేసాడు. హర్‌గోవింద్ సైన్యాన్నిపోగు చేశాడనీ, రాజులాగ ప్రవర్తిస్తున్నాడనీ, జహాంగీర్ చక్రవర్తికి కబురువెళ్లింది. చక్రవర్తి హర్‌గోవింద్‌ను గ్వాలియర్ కోటలో కొంతకాలం బందీగావుంచాడు. హర్‌గోవింద్ తరువాత హర్‌రాయ్, హర్‌క్రిషన్, తేజ్‌బహదూర్ గురువులయారు.

గురుతేజ్‌బహదుర్‌ను ఔరంగజీబ్ చక్రవర్తి ఢిల్లీకి పిలిపించాడు. ఇస్లాంమతాన్ని స్వీకరిస్తావా, ప్రాణాలు

పోగొట్టుకుంటావా అనిఅడిగాడు. ఇస్లాంను స్వీకరించడానికి తేజ్ బహాదూర్ అంగీకరించ లేదు. తేజ్ బహాదూర్‌ను ఔరంగజీబు చంపించాడు. 'శిర్ దియా, శిరార్ నదియా! ప్రాణం అర్పించాడు కాని మతాన్ని విడువలేదు' అని తేజ్ బహాదూర్‌ను గురించి, ఇప్పటికీ గౌరవంగా చెపుతారు.

తేజ్ బహాదూర్‌ను గురించి ఒక కథ వుంది. ఢిల్లీ కోటలో బందీగావున్నప్పుడు, తనజెయిలుగది కిటికీలోనుంచి, చక్రవర్తి అంతఃపురంలోని స్త్రీలను చూస్తూవుండేవాడని తేజ్ బహాదూర్ మీద నేరం మోపబడింది. ఆయనను చక్రవర్తి ఎదుట హాజరు పెట్టారు. తనమీదవచ్చిన ఆరోపణకు తేజ్ బహాదూర్ చెప్పినజవాబు ఇది: ఔరంగజీబ్ చక్రవర్తీ, నేను నాజెయిలులో పైగదిలో కూర్చుని, కిటికీలోనుంచి బైటికి చూసినమాటనిజమే. కాని నీ అంతఃపురంవైపుగాని, అంతఃపురంలోని స్త్రీలవైపుగాని నేను చూడలేదు. పడమటి వైపు సముద్రాంతరంనుంచి వస్తున్న ఇంగ్లీషువారివైపు చూస్తున్నాను, వాళ్ళు నీసామ్రాజ్యాన్ని అంతమొందించ బోతున్నారు."

తేజ్ బహాదూర్ తరువాత, ఆయన కుమారుడు గోవిందసింగ్ శిక్కులకు గురువయాడు. శిక్కులకు ఆయన పదవ గురువు. ఆఖరిగురువుకూడా ఆయనే. తన తరువాత, ఒక వ్యక్తి శిక్కులకు గురువుగా వుండరాదని, ఆయనే శాసించాడు.

శిక్కులను ఒక ప్రబలమైన జాతిగా తయారు చేసిన వాడు, గురు గోవిందసింగ్. ఆయన గురువయేటప్పటికి,

శిక్కుమతాన్ని అణచివెయ్యడానికి ఔరంగజేబ్ కఠిన చర్యలను తీసుకుంటున్నాడు. అంచేత, తమమతాన్ని నిలబెట్టుకోవాలంటే కత్తికట్టి, ఔరంగజేబును ప్రతిఘటించవలసిందే అని గురు గోవిందసింగ్ నిర్ణయించుకున్నాడు.

తండ్రి చనిపోయేటప్పటికి గురు గోవిందసింగ్ పదేండ్ల బాలుడు. గురుపీఠం అధివసించి, శిక్కులకు నాయకత్వం వహించేదాకా ఆయన పెర్షియన్, సంస్కృతం బాగా చదువుకున్నాడు.

## ఖల్సా

శిక్కులకు నాయకత్వం వహించగానే గురు గోవిందసింగ్ మొట్టమొదట చేసిన పని, వారికి 'ఖల్సా'ను బోధించడం. ఖల్సా అంటే పవిత్రత అని అర్థం. ఆయన అనుచరులు ఇప్పటికీ అదే పేరుతో పిలువబడుతున్నారు. శిక్కుమతస్తులందరూ కూడా పవిత్రులు కావడానికి, పవిత్రోదకములతో పుణ్యాహవచనం చేయించుకోవాలనే నిబంధనను గురు గోవిందసింగ్ పెట్టాడు. అలా పుణ్యాహవచనం చేయించుకున్న శిక్కులందరూ సమానమే, వారిలో ఎక్కువ తక్కువలు వుండరాదు అన్నాడు. అప్పుడు, శిక్కులలోని అగ్రకులాలవారు ఆయన నాయకత్వాన్ని వదలుకొన్నారు. కాని తక్కువకులాలుగా పరిగణింపబడినవారంతా ఆయనను చేరారు.

'ఖల్సా'ను అంగీకరించి, పుణ్యాహవచనం చేయించుకున్న తన అనుచరులందరికీ గురుగోవిందసింగ్, 'సింగ్' లని

నామకరణం చేశాడు. సింహంవలె ధైర్య సాహాలను చూపి, తమమతరక్షణకు సంసిద్ధులుగా వుండేవారు 'సింగ్' లన్న మాట. వీరంతా అనుసరించవలసిన విధానాలలో 'పంచ కక్క' ఒకటి. అంటే అయిదు 'క'లు అన్నమాట. కేశం, కంఘు, కచ్చ, కర, కృపాణ్. పంచకక్కను అనుసరించే ప్రతిశిక్కుమత స్తుడూ, తన కేశాలను కత్తిరించుకోరాదు; ఎల్లప్పుడూ తనశిగలో ఒకకంఘు (దువ్వెన)ను వుంచుకోవాలి; కచ్చ (లాగు)ను ఎప్పుడూ ధరించాలి; కుడిచేతి మణికట్టు వద్ద 'కర' (ఉక్కుమురుగు)ను ధరించాలి; కృపాణాన్ని (కత్తిని) ఎల్లప్పుడూ ధరించాలి.

ఖల్సాను అనుసరించే శిక్కులు, గ్రంథ్ సాహెబ్ కుతప్ప మరేవస్తువుకూ, ఏవ్యక్తికీ తల ఒగ్గరాదు.

ఈవిధంగా శిక్కులను ఒకకూడలిలోకి తీసుకొనివచ్చి, వారిని ఒకగొప్పసైన్యంగా తయారు చేశాడు గురు గోవింద సింగ్. ఇదంతాచూసిన ముస్లిము పరిపాలకులు, శిక్కులను తీవ్రచర్యలతో అణచివేయుడానికి ప్రయత్నించారు. గురు గోవిందసింగ్ పుత్రులిద్దరిని, సిర్హింద్ కోటలో, ఆ కోటను పాలిస్తున్న నవాబు చంపించివేశాడు. తరువాత కొద్దికాలా నికే, క్రీ. శ. 1708 సంవత్సరంలో, నాందెడ్ లో గురు గోవిందసింగ్ హత్యచేయబడ్డాడు.

గురుగోవిందసింగ్ తో గురుపరంపర అంతరించింది. తన అనంతరం గురువు అనేవ్యక్తి వుండడని ఆయనే చెప్పాడు. తనతరువాత, మతవిషయాలలో శిక్కులకు గురువు, గ్రంథ్

సాహెబ్ అనీ, సాంఘిక, రాజకీయవిషయాలలో శిక్కుల
సంఘమే గురువనీ ఆయన చెప్పారు.

గురుగోవిందసింగ్ అనంతరం శిక్కుసైన్యం చాలా
ఎక్కువగా పోరాటాలు జరిపింది. సైన్యాలనాయకులు ముస్లి
ములతో పోరాడి, చాలాదేశాన్ని జయించి రాజ్యాలు
స్థాపించారు. ఇలా ఏర్పడిన రాజులలో రంజిత్ సింగ్ చాలా
ప్రముఖుడు. బ్రిటిషువారు ప్రబలిన తరువాత, అన్నిరాజ్యా
లతోపాటు శిక్కురాజ్యాలుకూడా క్షీణించినవి.

ఈనాడు భారతదేశంలో సుమారు 65 లక్షలమంది
శిక్కులు వున్నారు. వీరిలో అత్యధికసంఖ్యాకులు పంజాబ్
లోనే వున్నారు.

కాలక్రమేణ, శిక్కుమతస్థులలోకూడా అనేకశాఖలు
ఏర్పడినవి. ప్రధానమతసూత్రాలను అందరూ పాటించి
నప్పటికీ, ఆచారాలలోనూ, విశ్వాసాలలోనూ విభేదాలు
ఏర్పడినవి.

పదిమంది గురువులనూ అంగీకరించనివారు కొందరు,
పదిమంది తరువాతకూడా గురువులు వున్నారని ఎవరో ఒక
గురువును విశ్వసించేవారు కొందరు, గ్రంథ్ సాహెబ్ లోని
కొన్నిభాగాలను అంగీకరించనివారు కొందరు, ఇలాగ శిక్కు
లలో శాఖలు ఏర్పడినవి. అయితే, ప్రధానంగా చెప్పవలసిన
భేదాలు రెండు. గురుగోవిందసింగ్ బోధ ప్రకారం దాడి
పెంచుకొనే ఖల్సాశిక్కులు, దాడిపెంచుకోని సాహజ్ ధారి
శిక్కులు.

శిక్కులలోగల వివిధశాఖలు ఇవి.

## నిరంకారి

దేవునికి రూపం లేదు; అందుచేత విగ్రహారాధన తప్పు అని విశ్వసించేవారు నిరంకారులు. గురుగోవిందసింగ్ అనంతరం శిక్కులలో కొందరు క్రమంగా హిందూ ఆచారాలను అవలంబించడంచూసి, దానిని అరికట్టడానికి దయాళ్ దాస్ అనే వర్తకుడు, నిరంకారి మతాన్ని బోధించాడు. వివాహం, శ్రాద్ధం మొదలైన సందర్భాలలో హిందూ ఆచారాలను అనుసరిస్తున్న శిక్కులకు, అలా చెయ్యకూడదని ఆయన బోధించాడు. కట్నాలను ఎక్కువగా యివ్వకూడదనీ, వితంతువివాహాలను చెయ్యవచ్చుననీ దయాళ్ దాస్ బోధించాడు. దయాళ్ దాస్ అనుచరులు ఆయనను గురువుగా అంగీకరించినందున, పదిమంది గురువుల అనంతరం గురువులు లేరని భావించే సనాతన శిక్కులు నిరంకారి శాఖను నిరసించారు.

## నామధారి

నామధారిశాఖకు 'కూకా' శాఖఅనికూడా పేరువుంది. నామధారిశాఖకూడా శిక్కులలో ప్రవేశించిన హిందూ ఆచారాలను పోగొట్టడానికే ఆరంభమైంది. శిక్కులలో కొంతమంది నాయకులు ఆస్తులను సంపాదించి, విలాస జీవితాన్ని గడపడం ప్రారంభించారు. వారిని మందలించి, త్రాగుడు, వ్యభిచారం మొదలైన దుశ్చర్యలు పనికిరావని వారికి బోధించి, వారిని సన్మార్గంలోకి తీసుకురావడం కూడా నామధారిశాఖ ప్రధానాశయం. ఈశాఖను స్థాపించినవాడు, భగత్ జవహార్ మల్.

నిరంకారిశాఖశిక్కులకూ, నామధారిశాఖశిక్కులకూ ఆశయాలలో తేడా ఏమీ లేదు. నిరంకారిశాఖవారు రాజకీయాలజోలికి పోకుండావుంటే, నామధారిశాఖవారు రాజకీయాలలో జోక్యం కలిగించుకున్నారు.

శిక్కుమతబోధలో ముఖ్యమైన అంశాలు ఏమిటంటే-

సత్యస్వరూపుడైన దేవుడు ఒక్కడే. దేవునికి ఆకారం లేదు. దేవుని స్వరూపాన్ని ఊహించడానికి మానవుడు అశక్తుడైనప్పటికీ, సత్ప్రవర్తనవల్ల దేవుని అనుగ్రహాన్ని మానవుడు పొందగలడు. మానవునికి పునర్జన్మ వుంది. పునర్జన్మలో మానవుడు ఏ రూపం పొందేదీ, యీ జన్మలో మానవుని ప్రవర్తనమీద ఆధారపడి వుంటుంది. అయితే, సత్ప్రవర్తనవల్ల మానవుడు పునర్జన్మలేకుండా చేసుకోవచ్చును. పునరావృత్తిలేని మోక్షం పొందడానికి, భగవదేచ్ఛప్రకారం నడుచుకోవాలి. భగవదేచ్ఛను తెలుసుకోవడం అందరికీ సాధ్యం కాదు. అంచేత, సామాన్యులకు గురువు అవసరం. అయితే, గురువుకు దేవత్వం ఆపాదించరాదు. గ్రంథ్ సాహెబ్‌ను గురువుతో సమానంగా భావించాలి. నదులలోను, కొండలలోను, విగ్రహాలలోను పవిత్రత ఏమీ లేదు. శిక్కుల మతానుష్ఠానంలో వారి ప్రధానవిధి ప్రార్థన. శిక్కులు ఉదయం చేసే ప్రార్థనలకు 'జప్‌జీ' అనీ రాత్రిచేసేప్రార్థనలకు 'రాహిరా' అనీ పేర్లు. మతధర్మాన్ని నిష్ఠతో పాటించే ప్రతిశిక్కూ, యీ ప్రార్థనలను రెండు వేళలా పఠించవలసిందే. శిక్కుమతస్తులెవరూ కఠోర దీక్షలను పూన నవసరం లేదు. సన్న్యాసం తీసుకోనక్కర లేదు.

సంసారజీవితాన్ని గడపవచ్చును. మాంసభక్షణను విసర్జించ నక్కరలేదు.

## గ్రంథ్‌సాహెబ్

శిక్కుమతస్థుల ప్రార్థనామందిరాలకు 'గురుద్వారా' లని పేరు. ఈ గురుద్వారాలలో గ్రంథ్‌సాహెబ్‌ను శిక్కులు పూజిస్తారు. పూజలను జరుపడానికి స్త్రీ పురుషులందరికీ హక్కు వుంది. కాని, పెద్దపెద్ద పట్టణాలలోని గురుద్వారాలలో ప్రత్యేకం పూజారులు ఏర్పడినారు. వీరికి మహంత్ లని పేరు. ప్రతిరోజూ ఉదయం ప్రార్థనలతో గ్రంథ్‌సాహెబ్‌ను తెరచి, దానిలోని కొన్ని భాగాలను చదువుతారు. తరువాత, గ్రంథ్‌సాహెబ్‌ను రోజంతా అలాగే తెరచి వుంచుతారు. సాయంత్రం మళ్ళీ ప్రార్థనలుచేసి, గ్రంథ్‌సాహెబ్‌లోని కొన్నిభాగాలను చదివి, గ్రంథాన్ని మూసివేస్తారు.

కులభేదాలు ఉండకూడదని గురునానక్ బోధించినప్పటికీ, శిక్కుమతస్థులలోకూడా క్రమంగా కులభేదాలు వచ్చాయి. ఈనాడు శిక్కులలోకూడా అస్పృశ్యులు వున్నారు.

జయదేవుడు, రామానంద, కబీర్, నామదేవ, సుఫి ఫరీదుద్దీన్ షాకర్‌గంజ్, నానక్‌లు వ్రాసిన భక్తిపాటలూ, మొదటి అయిదుగురు శిక్కు గురువులూ చేసిన బోధలూ, తొమ్మిదవగురువు తేజ్‌బహదూర్ రచనలూ, పదవ గురువు గురుగోవిందసింగ్ వ్రాసిన ఒక పద్యమూ గ్రంథ్‌సాహెబ్‌లో వున్నాయి.

గ్రంథ్‌సాహెబ్‌లోని ప్రథమ భాగాన్నే 'జప్‌జీ'

అంటారు. ఈ 'జప్‌జీ'ని ప్రతిశిక్కూ కంఠస్థం చేసుకొని, ఉదయం ప్రార్థనగా పఠించాలి. 'జప్‌జీ' తరువాత 'ఆశాకీ వార్.' ఇదికూడా ఉదయం పఠనకే ఉద్దేశింపబడింది. ఈ రెండు భాగాలూ గురు నానక్ రచనలే. తరువాత 'రాహిరా'. ఇది సాయంకాలపు ప్రార్థన మంత్రాలు. ఇవన్నీ చాలామంది గురువులు వ్రాసినవి.

గ్రంథ్‌సాహెబ్ తరువాత ఎక్కువ ప్రధానమైనది, దశమ్‌గ్రంథ్. ఈగ్రంథమంతా గురుగోవిందసింగ్ రచనలు. వీనిని గ్రంథస్థం చేసినవాడు, గోవిందసింగ్ శిష్యుడు మణిసింగ్.

ప్రతిదినమూ ప్రార్థనసమయంలో శిక్కులు, గ్రంథ్‌సాహెబ్‌తోపాటు దశమ్‌గ్రంథ్‌లోని కొన్ని భాగాలనుకూడా చదువుతారు.

శిక్కుల సంతానానికి నామకరణం చేసేటప్పుడు, గ్రంథ్‌సాహెబ్‌లో చేతికివచ్చిన ఏదో ఒకపుటను తెరచి, ఆ పుటలోని మొదటి అక్షరం ఏదో అదే మొదటి అక్షరంగా వచ్చే పేరుపెడతారు. శిక్కుల వివాహసమయంలో, వధూవరులు గ్రంథ్‌సాహెబ్‌కు నాలుగు ప్రదక్షిణాలు చేస్తూవుంటే, గ్రంథ్‌సాహెబ్‌లోని మంత్రాలు పురోహితుడు చదువుతాడు.

శిక్కులమతాన్ని ఒక్కవాక్యంలో వర్ణించాలంటే, సత్యస్వరూపుడైన భగవంతునిపట్ల భక్తి బోధించే మతం అని చెప్పాలి. ఈ విశ్వాసంతప్ప, తక్కిన ఆచార, సాంప్రదాయాలలో నానక్ బోధించిననాటికీ యీనాటికీ శిక్కుమతంలో కాలానుగుణమైన మార్పులు ఎన్నో వచ్చినవి.

# హిందూ మతం

హిందూమతం అంటే నిజానికి ఒకేఒక మతం కాదు. అదొక మతసముద్రం. ముక్తిని సంపాదించడానికిగల అనేక మార్గాలను అనుసరిస్తూ, ఒకరితో ఒకరు మతభేదమే ఒక కారణంగా విరోధం పెట్టుకోక, ఒకేసంఘంగా జీవించే భారతీయులంతా హిందువులే.

ఆర్య, అనార్యజాతుల మిశ్రమం క్రమంగా జరుగడంతో, ఉభయులమతాలూ సమ్మేళనంపొంది, ఉభయుల దేవతలూ ఒకే శ్రేణిలోకి వచ్చారు. అదే హిందూమతం. దేవతారాధనలో యజ్ఞకాండ క్రమంగా అంతరించి, ఒక ప్రక్క పూజాకలాపం పెరిగింది; మరొకప్రక్కన ఆధ్యాత్మికజిజ్ఞాస పెరిగింది. పూజాకలాపంలో ఎవరియిష్టదేవతను వారు, తక్కిన దేవుళ్ళకన్న అధికుడని భావించేవారు. అదే ఒకమతం. ఇలా అనేకమతాలు ఏర్పడ్డాయి. ఆధ్యాత్మిక జిజ్ఞాసలో, ఆత్మపరమాత్మల సంబంధాన్నిగురించి ఒకొకరు ఒకొకవిధంగా వాదించారు. ఇలా అనేకమతాలు ఏర్పడ్డాయి. ఇవన్నీ హిందూమతాలే.

హిందువుల మతాలనుగురించి చెప్పాలంటే, ఇప్పటికి లభించిన ఆధారాలనుబట్టి వేదాలలోని మతంతో ఆరంభించవలసిందే.

వేదాలరచన ఎప్పుడు ప్రారంభమైంది, అనేవిషయంలో, అభిప్రాయభేదాలు వున్నాయి. క్రీస్తుశకానికి

రెండువేల సంవత్సరాల పూర్వంనుంచి 1200 సంవత్సరాల లోపున వేదరచన జరిగిందని చాలామంది అభిప్రాయం.

వేదాలు నాలుగు. ఋగ్వేదము, సామవేదము, యజుర్వేదము, అధర్వవేదము.

వేదాలలోని ఋక్కులను, మంత్రములను నాలుగు గ్రంథములుగా విడమరచి, నాలుగువేదాలను ఏర్పరచిన వాడు కృష్ణద్వైపాయనుడని పురాణాలు చెపుతున్నవి. వేదవిభాగం చేసినందున, ఆయనకు వేదవ్యాసుడని పేరు వచ్చింది.

వేదాలలో మొట్టమొదటిది, ఋగ్వేదము. ఋగ్వేదం లోని ఋక్కులరచన క్రీస్తుశకానికి రెండువేల సంవత్సరాల పూర్వమే ప్రారంభమైనా, వానిని ఒకసంహితగా ఏర్పరచడం క్రీస్తుశకానికి వెయ్యిసంవత్సరాల పూర్వం జరిగిందని చరిత్రజ్ఞుల ఊహ. ఋగ్వేదంలో మొత్తం 1,017 ఋక్కులు వున్నాయి. ఇవన్నీ పదిమండలములుగా ఏర్పాటు చేయబడినవి. కొన్నితరాలుగా, ఆర్యులలోని వివిధతెగలు, దైవాలను ఉద్దేశించిచేసిన స్తోత్రాలు, దైవాలకు తెలిపిన తమ కోర్కెలు, తమతెగలుచేసిన యుద్ధాలు, సంపాదించిన విజయాలు, యజ్ఞమంత్రాలు, యజ్ఞవిధానం, కొంతమంది వ్యక్తులు వ్రాసినకవిత, ఇవన్నీ ఋగ్వేదంలో వున్నాయి. ఋగ్వేదంలోని భాష, పూర్తిగా యీనాడు యెవరికీ తెలియదు. నేడు వాడుకలోలేని పదాలూ, ఆనాటి అర్థం మారి నేటికి వేరేఅర్థాలను పొందిన పదాలూ ఎన్నో ఋగ్వేదంలో వున్నాయి.

## సామవేదం

సామవేదమంతా, సుమారు నూరుమంత్రాలు తప్ప, ఋగ్వేదంలోని మంత్రాలే. అయితే, యీ మంత్రాలన్నీ ఋక్కులను చదివినట్టుగా కాక, గేయపద్ధతిలో గానం చేస్తారు. ఏ గేయాన్ని ఏ రాగంలో గానంచెయ్యాలో, ఒకొక్క గేయాన్ని వివిధరాగాలలో గానంచేసేటప్పుడు స్వరాలలో ఏయేమార్పులు వుండాలో ఈ వేదం చెప్తుంది.

## యజుర్వేదం

యజుర్వేద మంతా కర్మకాండను బోధిస్తుంది. యజ్ఞాలలో హోతలు ఋక్కులను, ఉద్గాతలు సామములను పఠిస్తూవుంటే, అధ్వర్యులు కర్మకలాపాన్ని చెయ్యాలి. అధ్వర్యులు చెయ్యవలసిన కర్మను వివరించిచెప్పేది యజుర్వేదం.

యజుర్వేదం రెండు భాగాలు: కృష్ణయజుర్వేదం. శుక్లయజుర్వేదం.

మంత్రము, అధ్వర్యులు చెయ్యవలసిన కలాపాన్ని వివరించే బ్రాహ్మణము, ఈరెండూ కలిసివుండేది కృష్ణ యజుర్వేదము; మంత్రము వేరు, బ్రాహ్మణము వేరుగావుండేది శుక్లయజుర్వేదము.

## అధర్వవేదము

ఈ వేదమంతా, మంత్ర, తంత్ర వేదమని చెప్ప వచ్చును. తాయెత్తులు, చక్రాలు, భూతోచ్చాటన మొద

లైన విషయాలతో నిండివుంటుంది. హితులైనవారికి మేలు కూర్చే ప్రయోగాలూ, కిట్టనివారిని నాశనంచేసే ప్రయోగాలూ అధర్వవేదంలో వున్నాయి. చనిపోయిన మానవుల ప్రాణం, ఏలోకానికి పోతుందో, నరకలోకమంటే ఏమిటో చెప్పేది యీ వేదమే.

## బ్రాహ్మణములు

మూలవేదమంతా ఋక్కులు. లేక మంత్రాలు. ప్రతి వేదంలోని మంత్రాలభాగానికి సంహిత అనిపేరు. ఈ మంత్రాలను హోతలు, ఉద్గాతలు పఠిస్తూవుంటే, అధ్వర్యులు చెయ్యవలసిన కర్మకాండను వివరించేభాగాలకు బ్రాహ్మణములని పేరు. ఈ బ్రాహ్మణములలో, ఏఏరాజులు ఏయే యజ్ఞములను చేసినదీ వివరాలుకూడా కొన్నివున్నాయి. యజ్ఞవాటికలను ఎలానిర్మించాలి, యజ్ఞాలకుకావలసిన సంభారాలు ఏమిటి, పురోహితులు ఎందరువుండాలి మొదలైన వివరాలన్నీ బ్రాహ్మణములలో వుంటాయి.

## ఆరణ్యకములు

వీనిని బ్రాహ్మణములకు అనుబంధములని చెప్పవచ్చును. ఆరణ్యకములన్నీ గోప్యమైనవిషయాలనీ, వాటిని అందరూ వినకూడదనీ ఒకభావం.

అంచేత, అరణ్యాలలో రహస్యంగా వీటిని గురువులు శిష్యులకు బోధించేవారు. అంచేతనే వీటికి ఆరణ్యకములని పేరువచ్చింది. కర్మకాండను ఎక్కువగా చెయ్యడంకన్న, ధ్యానంలో ఎక్కువగా యజ్ఞకలాపాన్ని జరుపవచ్చుననే భావాన్ని బోధించేవి ఆరణ్యకములు. అందువల్ల ఆరణ్యక

ములలో కర్మకాండ ఎక్కువగా కనుపడదు. ఆధ్యాత్మిక చింతనలో పరిగణనీయమైన అభివృద్ధిచూపిన ఉపనిషత్తులకు ఆరణ్యకములే ప్రాతిపదికలని చెప్పవచ్చును. ఏమంటే బ్రహ్మజ్ఞానము పొందడానికి చేయవలసిన ఉపాసనలు మొట్టమొదటిసారిగా ఆరణ్యకములలోనే చెప్పబడినవి.

## ఉపనిషత్తులు

భారతదేశంలో ఆధ్యాత్మికచింత అత్యుత్తమస్థాయిని పొందిన కాలం ఉపనిషత్తులకాలమే అని చెప్పవచ్చును. "ఉపనిషత్" అంటే "సమీపంలో కూర్చోవడం" అని అర్థం. అంటే గురువువద్ద శిష్యుడు కూర్చుని వేదాంతమును నేర్చుకోవడం అనిగాని, ఒకరివద్ద మరొకరు కూర్చుని వేదాంతమును చర్చించడం అనిగాని తాత్పర్యం చెప్పవచ్చును. ఈవిధంగా గురువు శిష్యునికి బోధించిన వేదాంతానికీ, లేక ఇద్దరుముగ్గురుకలిసి చర్చించిన వేదాంతానికీ ఉపనిషత్తుఅనే పేరువచ్చింది. ఉపనిషత్తులలో ప్రధానమైనవి పన్నెండు. వీనిలో, ఐతరేయోపనిషత్, కౌషీతకోపనిషత్, తైత్తిరీయోపనిషత్, మహానారాయణోపనిషత్, బృహదారణ్యకోపనిషత్, ఛాందోగ్యోపనిషత్, కేనోపనిషత్తులు, బ్రాహ్మణములలోనే ఇమిడివున్నవి.

కఠ, శ్వేతాశ్వతర, ఈశ, ముండక, ప్రశ్నోపనిషత్తులు ప్రత్యేకంగా బ్రాహ్మణముల తరువాత వచ్చాయి.

వేదములసారాన్ని బోధించేది, వేదాంతం. ఉపనిషత్తులన్నీ వేదములసారాన్ని విపులపరచి, బ్రహ్మజ్ఞానాన్ని బోధిస్తాయి కనుక, వాటికి వేదాంతం అనిపేరు వచ్చింది.

## వేదాంగములు

వేదములు ప్రాతిపదికగా తరువాత ఏర్పడిన గ్రంథాలకు వేదాంగములని పేరు. ఇవి ఆరుశాఖలు.

1. శిక్ష. సరియైన ఉచ్చారణను బోధిస్తుంది.

2. ఛందస్సు. శ్లోకముల రచన, కవిత్వమును బోధిస్తుంది.

3. వ్యాకరణము.

4. నిరుక్తము; శబ్దముల వ్యుత్పత్తి ప్రకారమును తెలుపుతుంది.

5. జ్యోతిషము. నక్షత్రములు, గ్రహములు, వీటి గమనము, రూపు మొదలైన విషయాలను బోధిస్తుంది.

6. వేదాంగము (కల్పము). ఇది బ్రాహ్మణులు అనుసరించవలసిన నిత్యవిధానాలను, కర్మకాండను బోధిస్తుంది. ఇది రెండుభాగాలు, ఒకభాగానికి గృహ్యసూత్రములనీ, రెండవభాగానికి సమయచరితసూత్రములనీ పేరు. నిత్యకృత్యములలో అనుసరించవలసిన విధులను, ఆచారములను బోధించేవి, సమయచరిత సూత్రములు. గృహస్థులు ఆచరించవలసిన వ్రతములను, నియమములను బోధించేవి గృహ్యసూత్రములు. సమయచరితసూత్రములను శ్రౌతసూత్రములనీ, ధర్మసూత్రములనీ కూడా అంటారు. అయితే గృహ్యసూత్రములనూ, శ్రౌతసూత్రములనూ కలిపి 'స్మార్తము' అంటారు.

## వేదోపాంగములు

మీమాంస: వేదములలోని సిద్ధాంతములను, ఆచార ములను వివరిస్తుంది.

న్యాయ: నాస్తికవాదాన్ని ఖండిస్తుంది.

ధర్మశాస్త్ర: మనుష్యుల ప్రవర్తం, ఆచారములు, కట్టుబాట్లను బోధిస్తుంది. ధర్మశాస్త్రములలో హిందువులకు ముఖ్యమైనది మనుధర్మశాస్త్రము. క్రీస్తుశకానికి 1200 సంవత్సరాలకు పూర్వం మనుధర్మశాస్త్రము రచింపబడిన దని చాలామంది పరిశోధకుల విశ్వాసము.

## ఉపవేదములు

ఆయుర్వేదము, ధనుర్వేదము, గంధర్వవేదము, అర్థ శాస్త్రము.

## దేవుళ్లు

ఋగ్వేద రచన కొంత జరిగిన తరువాతనే, ఆర్యులు భారతదేశానికి వచ్చివుంటారు. ఏమంటే, ఋగ్వేద ప్రథమ భాగాలలో వున్న ఆర్యుల దేవుళ్ళకంటె ఎక్కువ దేవుళ్ళు ఋగ్వేదపు ఆఖరు భాగాలలో కనపడుతున్నారు.

ఋగ్వేద ప్రథమ భాగాలలో ఆర్యుల దేవుళ్లు వీరు : ఇంద్రుడు, అగ్ని, వరుణుడు, సూర్యుడు, రుద్రుడు, విష్ణువు, యముడు, అశ్వినీదేవతలు, సోముడు.

ఋగ్వేదకాలంనాటి ఆర్యుల ముఖ్యదేవత ఇంద్రుడు. ఆర్యులను యుద్ధాలలో గెలిపించవలసినవాడూ, సకాలంలో వర్షాలు కురిపించి పంటలు పండించవలసినవాడూ, ఆర్యులు

చేసే యజ్ఞాలలో ప్రధానభాగాన్ని స్వీకరించే అధిదేవతా, ఇంద్రుడే.

ఆర్యులకు సహాయం చెయ్యడానికి ఇంద్రుడు చేసే యుద్ధాలలో అతనికి సహాయపడేవారు మరుత్తులు. వీరంతా, ఆకాశంలో రథాలమీద సంచరిస్తూ, ఆర్యుల శత్రువులను హతమార్చడంలో ఇంద్రునికి తోడ్పడతారు.

ఇంద్రునితరువాత ముఖ్యదేవుడు, వరుణుడు. ఋగ్వేద కాలానికి పూర్వం, వరుణుడే ప్రధానదేవుడుగా వుండేవా డేమో. కాని, ఋగ్వేదకాలంనాటికి ఇంద్రునిప్రభ హెచ్చి, వరుణుడు రెండవదేవు డయాడు. ప్రపంచంలో ప్రజలందరూ సరిగా నడచుకుంటున్నారో లేదో కనిపెట్టేదేవుడు వరుణుడు. స్వర్గంలో, ఒకగొప్పనగరిలో ఈయన వుంటాడు. ఋతువులు క్రమం తప్పకుండా నడిచేటట్టు చూసేది ఈయనే. వరుణుడు సర్వాంతర్యామి. ఈయనకు తెలియకుండా ప్రపంచంలో ఏమీ జరగదు. ఎవరు, ఎక్కడ, ఎంతరహస్యంగా మాట్లాడు కున్నా, ఎంతరహస్యంగా ఏపనిచేసినా వరుణుడికి తెలియ కుండా వుండదు. పాపులను వరుణుడు చాలా కఠినంగా శిక్షిస్తాడు.

మరొక ముఖ్యమైన దేవుడు సూర్యుడు. ఏడు గుఱ్ఱా లను కట్టిన రథమెక్కి, ఏడుకళ్లెములను చేతబూని, తూర్పు దిక్కునుంచి పడమటకు లోకాన్నంతనూ తన కాంతులతో నింపి ప్రతిరోజూ ఆకాశంలో ప్రయాణం చేస్తూ ప్రపంచానికి జీవశక్తిని ప్రసాదించే యీ సూర్యునే ఆర్యులు సవిత్రు

దన్నారు. సవిత్రుని స్తుతి, ఆర్యుల మంత్రాలలో అతి పవిత్ర మైనది. దానికే సావిత్రి అనీ, గాయిత్రి అనీ పేర్లు.

తత్ సవితు ర్వరేణ్యం
భర్గో దేవస్య ధీమహి
ధియోయోనః ప్రచోదయాత్.

ఇదే ఆర్యులకు పరమపవిత్రమైన గాయిత్రి. ఈ గాయిత్రిని జపించడం, యీనాటికీ అత్యంతపవిత్రమైన విధిగా ఆచారవంతులైన బ్రాహ్మణులు పాటిస్తారు.

లోకానికి వెలుతురు ప్రసాదించి, తమకు దారిని చూపుతూ, తప్పిపోయిన తమపశువుల్లను వెతుక్కోడానికి సహాయపడుతూ, తమకు రక్షకుడుగావున్న యీ సూర్యునే ఆర్యులు పూషు డన్నారు.

ఆర్యుల దేవతలలో అశ్వినీదేవతలుకూడా ముఖ్యులే. పడవలు మునిగిపోతే, ఆ పడవలలోనివారిని ఒడ్డుకు చేర్చడం, రోగాలను నయం చెయ్యడం, యుద్ధాలలో అంగవికలులైన వారికి కృత్రిమ అంగాలను కూర్చడం, అవివాహితలైన స్త్రీలకు వరులను చూపడం, అశ్వినీదేవతలు చేసే సత్కార్యాలు. వీరికే నాసత్యులని కూడా పేరు. అశ్వినీదేవతలంటే ఆపద్బాంధవు లన్నమాట.

ఆర్యులు తమజీవితానికి అతిముఖ్యమైనదిగానూ, తమ పూజలకు అతిపవిత్రమైనదిగానూ పరిగణించిన భౌతికశక్తి అగ్ని. ఇలాటి అగ్నిని ఒక దేవతగా భావించి వారు అనుదినమూ పూజించేవారంటే వింత ఏమీ లేదు.

సోముడు అంటే ఓషధులను వాటిమహాత్తు పోకుండా

కాపాడే దేవుడు, చంద్రుడు. ఋగ్వేదంలోని ఒక మండలం అంతా సోముని స్తోత్రం చేసే మంత్రాలే.

ఋగ్వేద కాలంలో సామాన్య దేవుడుగా వుండి, ఆర్యులు అనార్యులు కలయిక పొందిన తరువాత శివత్వాన్ని పొంది, తరువాత త్రిమూర్తులలో ఒకడై, యీనాడు శైవులకు ఏకైక దేవుడైన రుద్రుడు కూడా ఆర్యుల దేవుళ్ళలో ఒకడు. ఆరోజులలో రుద్రుడు, రౌద్రమూర్తి. ఆగ్రహం వస్తే నాశనం కలిగించేవాడు: అనుగ్రహం వస్తే తుష్టి, పుష్టి ప్రసాదించేవాడు. అనార్య సాంప్రదాయంలో శివుడు, లింగమూర్తి. ఆర్యసాంప్రదాయంలో శివుడు పంచ వక్త్రుడు. శూలపాణి. - ఈ రెండిటి కలయికలో నేటి శివారాధన జరుగుతున్నది. ఆలయంలోని మూలవిరాట్ సాధారణంగా లింగరూపంలో వుంటే, ఉత్సవ విగ్రహం పంచ వక్త్రుడు; శూలపాణి, నందివాహనుడు.

విష్ణువు, ఆర్యుల దేవుళ్ళలో ఒకడే. ఋగ్వేద కాలంలో విష్ణువు సూర్యునిఅంశలలో ఒకడుగా పరిగణింపబడినాడు. యజ్ఞ భాగాన్ని స్వీకరించడానికి తప్పక ఆహ్వానించవలసిన దేవతలలో విష్ణువు ఒకడు. తరువాత, అనార్యుల 'విను', ఆర్యులవిష్ణువు కలిసిపోయారు. విష్ణువు, శివునితో సమానుడైన పెద్ద దేవుడయాడు.

ఆర్యులమతంలో ప్రధానమైన ధర్మం, యజ్ఞం. యజ్ఞంలో దేవతలు ఆహూతులై యజ్ఞ వేదికమీదికి వచ్చి, యాజ్ఞికులు అర్పించిన హవిస్సులను స్వీకరించేవారు. యజ్ఞం చేసినవారికి కలిమినీ, బలిమినీ ప్రసాదించేవారు.

భారత దేశంలో స్థిరనివాసం ఏర్పరచుకున్న తరువాత, అంతకుపూర్వమే అచ్చటవున్న ప్రజల దేవుళ్ళలో కొందరినికూడా ఆర్యులు తమ దేవుళ్లుగా చేసుకున్నారు. ఈ విధంగా ఆర్యుల దేవుళ్ళ శ్రేణిలోకి చేరిన ముఖ్యదేవతలువీరు.

శివుడు; శక్తి, (దుర్గ); సుబ్రహ్మణ్యేశ్వరుడు (స్కందుడు, కుమారస్వామి, వేలు) గణేశుడు (పుళ్ళైయార్).

అనార్యుల దేవుళ్ళను తమ దేవుళ్లుగా ఆర్యులు చేసుకున్నారంటే, అది తమకన్నపూర్వమే భారతదేశంలో వుంటున్న ప్రజలతో ఆర్యులు ఒకేసంఘంగా ఏర్పడి ఒక రాజీకి రావడం అన్నమాట. అంటే, ఆర్యుల దేవతలను అనార్యులు ఆరాధించడంకూడా ప్రారంభమైంది. ఈవిధంగా ఆర్య అనార్య జాతులు మతవిషయంలో ఒకకలయిక పొందారు. మతంలో ఐక్యత కుదిరేటప్పటికి, కుల, వర్గ భేదాలు తరువాత ఏర్పడినప్పటికీ, సాంఘికంగా ఏకత్వం వచ్చింది. ఈ పరిణామమే భారతజాతి ఏర్పడడం అనిగాని, హిందూమతం ఏర్పడడం అనిగాని అనవచ్చును. ఆర్యులు రాకపూర్వం భారతదేశంలోవున్న ప్రజలు పంటలను పండించే ఒక దేవుణ్ణి, ప్రజలందరికీ తల్లిగా ఒక స్త్రీ మూర్తినీ, కొన్ని చెట్లనూ, మృగాలనూ దేవతలుగా ఆరాధించినట్టు కనపడుతుంది.

అనార్యుల ముఖ్యదేవత శివుడు. శివునిరూపం, లింగం. ఆర్యులు ఈ దేవతనుకూడా తమ దేవతల శ్రేణిలో చేర్చుకొన్నారు. రుద్రుడు, శివుడయాడు. రౌద్రమూర్తి, మంగళమూర్తి అయాడు.

ఆర్యుల అనార్యుల కలయికతో ఏర్పడిన హిందూ మతంలో, అనార్యుల దేవతలైన శివ, విష్ణువులకు ప్రధాన స్థానం ఏర్పడింది. ఆర్యుల దేవతలైన ఇంద్రుడు, వరుణుడు మొదలైనవారంతా శివవిష్ణువులకు లోబడిన దిక్పాలు రయారు.

సృష్టికి మూలకారణమైన శక్తిని బ్రహ్మగా నిర్వచించి, శివవిష్ణువులతో సమానస్థానం బ్రహ్మకు యివ్వడం, తరువాత జరిగింది. ఋగ్వేదకాలంలో, రుద్రుడు ఒకముఖ్య దేవత. రుద్రుడు, ప్రళయంకలిగించి సర్వనాశనం చెయ్యగల భయానకమూర్తి.

యజుర్వేద కాలంనాటికి, రుద్రుడు శివుడైనాడు. శివ రూపంలో అతడు మంగళకరుడు. శంకరుడు. అతడే మహాదేవుడు,

తరువాత గృహ్యసూత్రములలో, రుద్రుడు, హరుడని పేర్కొనబడినారు.

ఉపనిషత్తులకాలంలో శివుడు ప్రధాన దైవమయాడు. భగవద్గీతలో, సృష్టికర్తలకు ప్రభువుగా వర్ణింపబడినాడు. క్రీస్తుశకానికిపూర్వం నాలుగువందల ఏండ్లనాటికి, క్రమంగా శివుడు మహేశ్వరుడయాడు. శివునిఅర్చించేవారు శైవులని పిలువబడేవారు.

క్రీ. శ. నాల్గవశతాబ్దంనాటికి, శివునికాక విష్ణువును అర్చించేవారు వైష్ణవులనే పేరును పొందినారు. విష్ణువునే భగవంతునిగా అర్చించేవారంతా, భాగవతులనీ, పాంచరాత్రులనీ పర్యాయనామాలను పొందారు.

ఈ ఇద్దరు దేవతలనూ హరిహర, శంకరనారాయణ రూపంలో కొందరు ఆరాధించేవారు. బ్రహ్మకుకూడా హరి హరులతో సమానస్థానం కల్పించడం జరిగినతరువాత, హరి, హర, బ్రహ్మలనే త్రిమూర్తులు ఏర్పడినారు.

వేదకాలంలో ఆర్యులకు విగ్రహారాధన లేదు; పూజా కలాపం లేదు; దేవాలయాలు లేవు. ఆర్యులమతమంతా యజ్ఞాలుచెయ్యడం. అందువల్ల, యజ్ఞంచేసినప్పుడు ప్రత్యేకం యజ్ఞవాటికలను కట్టేవారు. యజ్ఞం పూర్తికాగానే వాటి కలను యెత్తివేశేవారు. గృహస్థులయిండ్లలో అగ్నిహో త్రాన్ని అర్చించేవారు. ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం, సావిత్రిని జపించేవారు.

అనార్యులు విగ్రహారాధన చేసేవారు. సాధారణంగా ప్రతియింటిలోనూ శివలింగమో, విష్ణువుకూర్మావతారరూప విగ్రహమో, శక్తివిగ్రహమో వుండేది. ఈ విగ్రహాలకు పూజచేసేవారు. నగరపాలకులుగాని. భాగ్యవంతులుగాని ప్రత్యేకం దేవాలయాన్ని కట్టిస్తే, అక్కడికి సామాన్య ప్రజలుకూడా వెళ్ళేవారు.

ఆర్యులు అనార్యులు కలసి, వీరిరువురిమతాలు సమ్మేళనంపొందినతరువాత దేవాలయాలలో విగ్రహారా ధన, విపులమైన, పూజాకలాపం ఏర్పడినవి. ఆలయాలు, విగ్రహాలు, పూజావిధానం అనార్యులవై తే, పూజా మంత్రాలు, పుజారిత్వం ఆర్యుల వయాయి. కొన్నికొన్ని ఆలయాలలో అనార్యులే పూజారులుగావుండడం లేకపోలేదు. ఈ విధమైన ఆర్య, అనార్య సమ్మేళనమే హిందూమతం.

కాలక్రమేణ, ఏకదేవత్వం హిందూమతస్థుల విశ్వాసంగా పరిణమించినా, దేవునికి మూడుప్రధానఅంశలు నిర్ణయింపబడినవి. ఒకఅంశకు ఒకమూర్తి నిర్ణయింపబడినది. ఈ త్రిమూర్తులపేర్లు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు.

సృష్టిచేశేవాడు బ్రహ్మ; రక్షణచేశేవాడు విష్ణువు; నాశనంపొందించేవాడు మహేశ్వరుడు.

త్రిమూర్తితత్వం దేశమంతటా వ్యాపించినప్పటికీ, విష్ణువుకూ, మహేశ్వరునికీ దేవాలయాలు నిర్మించి అర్చన, ఆరాధనలు చెయ్యడం వాడుకలోకి వచ్చిందికాని, బ్రహ్మకు మాత్రం దేశంలో ఒకేఒక దేవాలయం వుంది. (అజ్మీర్ సమీపంలో పుష్కరసరస్సువద్ద). ఈ విధంగా హిందూ మతంలో దేవతలశ్రేణి, పూజాకలాపం ఒకప్రక్కన ఏర్పడుతూవుంటే, మరొకప్రక్కన ఆధ్యాత్మికచింత కూడా ఎక్కువగా వుండేది.

## ఆధ్యాత్మికచింత

ఈ ప్రపంచసృష్టికి కారణం ఏమిటి; ఏశక్తి యీ ప్రపంచాన్ని నడపుతోంది? ఈ సృష్టిలో మానవునిస్థానం ఏమిటి? మానవునికీ, సృష్టికికారణమైన శక్తికీ గల సంబంధం ఏమిటి? మానవునిజన్మ ఆకస్మికమా, ఆలోచనాపూర్వమా? ఈజన్మ యింతేనా? లేక, పునర్జన్మవుందా? ఇలాంటి ఆలోచనలతో మునులూ, యోగులూ, తపస్వులూ చర్చలు ప్రారంభించారు. ఈచర్చలే ఉపనిషత్తులు.

ఉపనిషత్తుల బోధఫలితంగా కర్మవాదం బయలుదేరింది. నేటిజన్మ పూర్వజన్మకర్మఫలం; నేటికర్మమీదనే

పునర్జన్మ ఆధారపడివుంటుంది. ఈవాదమే, తరువాత బౌద్ధ మతానికి పునాది అయింది.

వాంఛలను విడచిపెట్టడమే బ్రహ్మజ్ఞానం పొందడం; బ్రహ్మజ్ఞానం పొందడమే, ముక్తిపొందడం అనేభావం కఠోప నిషత్తులో నిర్వచించబడింది. ఈభావం బౌద్ధమతంలో ఒక ప్రధానధర్మం అయింది.

ఉపనిషత్తులకాలంలో, ఆధ్యాత్మికచింత పలువిధాల నడిచింది. దేవుడు వున్నాడనే వాదం; దేవుడు లేడనే వాదం, ప్రపంచమంతా దేవునిరూపమే ననే వాదం; దేవుడు (అంటే పరబ్రహ్మ) వేరు, జీవుడు వేరు అనేవాదం; పునర్జన్మవుందనే వాదం; పునర్జన్మ లేదనే వాదం; సరస్వతంత్రుడైన మానవుడు తన ఇష్టంవచ్చినరీతిగా జీవితం గడపవచ్చుననీ, మానవుడు మరణించినప్పుడు శరీరంతోపాటు ప్రాణంకూడా నాశనం పొందుతుందనీ చెప్పేవాదం.

ఇలా అనేకవాదాలు బయలుదేరాయి. ఇన్ని మత వాదాలు వున్నప్పటికీ, హిందూసంఘం ఒకటిగానే వుండేది. అన్నిమతాలూ హిందూమతంలోని వివిధశాఖలుగా పరిగణింపబడేవి.

క్రీస్తుశకారంభానికి కొంతపూర్వమే హిందూ మతంలో ఆరు భిన్నశాఖలు ఏర్పడినవి. అవి ఇవి: న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, మీమాంస, వేదాంత.

న్యాయవాదం: స్పష్టమైన ఆలోచనలతో, సునిశితమైన తర్కంవల్ల బ్రహ్మజ్ఞానం పొందవచ్చునని చెపుతుంది.

వైశేషికవాదం: ప్రపంచం అణురూపమైనది. ఆత్మ వేరు, అణువు వేరు. అణువులు ఆత్మకు కార్యకారిణులు. ప్రతి అణువుకు విశేషతత్వ మున్నది. అణువులు కల్పాంతం వరకు నాశనము లేనివి. కల్పాంతంలో అణువులు నాశనం పొందుతవి. మళ్ళీ కల్పం ఏర్పడినప్పుడు, మరొక బ్రహ్మ కొత్త అణువులను సృష్టిస్తాడు. అణువులు విశేషతత్వాలను కలిగినవైతే, ఆత్మ, మనస్సు, కాలము, ఆకాశము నిర్గుణమైనవి.

సాంఖ్యవాదము : దేవుడు లేడు. ప్రపంచమంతా ఇరవై అయిదు మూలతత్వాలతో కూడి వున్నది. వీనిలో మొదటిది, ప్రధానమైనది, ప్రకృతి. ప్రపంచసృష్టి, యీ ప్రకృతికి సహజస్వభావము. ప్రకృతినుంచి బుద్ధి, బుద్ధినుంచి అహంకారము పుడుతున్నవి. అహంకారంనుంచి, ఆకాశము, వాయువు, వెలుతురు, నీరు, భూమి అనే పంచతన్మాత్రలు పుడుతున్నవి. ఈపంచతన్మాత్రలే రూపం పొంది పంచమహాభూతములు అవుతున్నవి. ఈపంచమహాభూతములతో అహంకారం సంయోగం పొంది, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లనే పంచజ్ఞానేంద్రియములు పుడుతున్నవి. ఈ జ్ఞానేంద్రియముల నుంచి, పంచకర్మేంద్రియములు పుడుతున్నవి. అహంకారంనుంచి మనస్సు పుడుతున్నది. ఈ ఇరవై నాలుగు తత్వములు కాక, ఇరవయ్యైదవదీ, పురుష. పురుషతత్వం ప్రకృతిమీదగాని, ప్రకృతి పురుషునిమీదగాని ఆధారపడివుండవు. పురుషునితో సంబంధం లేకుండానే ప్రకృతి ప్రపంచసృష్టిని చేసుకుంటూపోతుంది. పురుషుడు

యీా సృష్టిలో యిరుక్కుంటాడు. ఈ సత్యాన్ని గ్రహించి ప్రకృతి బంధనాలనుంచి పురుషుడు విముక్తుడైతే, అదే మోక్షం. సృష్టి అంతా తమో రజస్సత్వ గుణాలతో నిండి వుంటుంది.

యోగవాదము: యోగాభ్యాసమువల్ల మోక్షము పొందవచ్చును. యోగులు యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధి అనే అష్ట విధులను పాటించాలి. మానవుని శరీరంలో తలనుంచి గుదమువరకూ సుషుమ్న నాడి వుంది. ఈ నాడిపై భాగంలో, అంటే మానవుని తలలో సహస్రారచక్రము వుంది. గుదం వద్ద కుండలినీచక్రము వుంది. ఈకుండలినీచక్రంలోని శక్తిని, యోగాభ్యాసంవల్ల ప్రకోపింప చెయ్యవచ్చును. కుండలినీ శక్తిని ప్రకోపింపచేసి సుషుమ్నగుండా సహస్రారచక్రం వరకు తీసుకొనిపోవచ్చును. కుండలినీశక్తిని ప్రకోపింపచేసినప్పుడు, యోగికి గొప్పశక్తులు కలుగుతవి. కుండలిని సహస్రారమును చేరినప్పుడు మానవుడు సంపూర్ణమైన మోక్షమును పొందుతాడు.

మీామాంస: వేదాలు అపౌరుషేయములు. అవి తప్ప ప్రమాణ గ్రంథాలు లేవు. వేదాలలో చెప్పిన ప్రకారం నడుచుకోవడమే మోక్షానికి మార్గం.

వేదాంతము: వేదాలకు అంతం ఇదే. దీనినే ఉత్తర మీామాంస అనికూడా అంటారు. మీామాంస వాదం వేదాంతంగా పరిణమించడమే, ఇలా చెప్పడానికి కారణం. వేదాంత వాదానికి మూల గ్రంథం, బాదరాయణుడు

